## రవీంద్ర ఆర్ట్ ప్రొడక్షన్స్

# డాక్టర్ ఆనంద్

స్క్రీన్‌ప్లే దర్శకత్వం: వి. మధుసూదన రావు

నిర్మాత: డి.వి. రెడ్డి

ఆంధ్ర: రాయల్ ఫిలిమ్స్
సీడెడ్: జయలక్ష్మి పిక్చర్స్
నైజాం: యస్.యన్.పిపి

VIJAYA



వాయిల్స్ అతి మనోహరముగా
నేయబడినవి! పల్లని,
పెలుసైన, వశీకరమగు,
శోభాయమాన రంగులు,
ఆకర్షణీయమైన నమూనాలు,
మీ హావభావములకు లేక
శైలికి సరిపోయినవి.




# మఫత్‌లాల్ గ్రూప్

## 2×2 వాయిల్స్ అండ్ లినోస్

"టెరీన్"/కాటన్, "టెరిలైజ్డ్" మరియు "మేపిసైజ్డ్" క్వాలిటీలో కూడా లభించుచున్నవి.

న్యూ శోరక్ (శోరక్) అహమదాబాద్ • న్యూ శోరక్, నడియాద్ . స్టాండర్డ్, బొంబాయి . స్టాండర్డ్ (న్యూ చైనా) బొంబాయి • స్టాండర్డ్, డీవాస్ • సాస్సూన్, బొంబాయి • సాస్సూన్ (న్యూయూనియన్), బొంబాయి . సూరత్ కాటన్ సూరత్ . మఫత్‌లాల్ ఫైన్ . నవసారి

EPE Aiyars. M-99 Tel.




నవజ్యోతి ఫిలిమ్స్

# అడుగుజాడలు

స్క్రీన్‌ప్లే-డైరెక్షన్: చాణక్య నిర్మాతలు: యం. సాంబశివరావు-జి. వందనం

త్వరలో రిలీజ్

తన తండ్రి మరణానికి కారకుడు,
తన్ను అంధురాల్ని చేసిన, హృదయంవేదనుకొన్న మనిషి.
తనకు అండయ్యి, ఆరాధ్య దైవమౌతాడు.
కాని అతనే ఆ మొదటి వ్యక్తి అని
తెలుసుకోగలిగిన నాడు అమె మన్నించగలదా?

తప్పక చూడండి










ఏ బ్రాండు ఉతికే బట్టలన్నీ మెరయమెరిసే తెలుపు! నిష్కళంకమైన శుభ్రత! ఇది యెల్లి ముద్దం కొలది నురగ గల సర్ఫ్ యొక్క ఉతికే అధిక శక్తి వల్లనే. మీ బట్టలన్నిటి ఉతుకును చాలా సులభం చేస్తుంది. మీ పిల్లల బట్టలు, షర్టులు, చీరలు... ప్రతిదీ అమిత తెల్లగాను, ప్రతిదీ పరిశుభ్రంగాను ఉంటుంది. సర్ఫ్‌తో ఇంట్లో ఉతుక్కోండి.

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును

హిందుస్తాన్ లీవర్ తయారీ

శ్రీకృష్ణ

# వనమహోత్సవాలు, మన సాంప్రదాయాలు

ఆధునిక భారతదేశంలో, సాంప్రదాయంగా పారంపర్యమైన ఆచారాలు, పునః పునః ప్రత్యక్షమయే వేడుకలెన్నో వున్నాయి. అందులో 'వనమహోత్సవం ఒకటి', 'జాతీయ పారిశుధ్య వారం' రెండవది. వాన గాలులు మళ్ళీ తిరుగుతున్నాయనగా పూలమ్మే వాళ్ళకో పర్వదినం! ప్రదర్శనాదినంగా అక్టోబరు మూడవ తేదీని పిలుస్తున్నారు.

పదేళ్ళ నుంచి వనమహోత్సవాలు దేశ వ్యాప్తంగా జరుగుతున్నాయి. అశోకుని కాలం నాటి ధర్మాన్ని పునరుద్ధరింప జేయాలని ఈ పద్ధతి అవలంబించబడింది! వర్ణాంతరాలకు గాని, వర్గాంతరాలకు గాని ప్రత్యేక స్థానమివ్వని మన సర్వ స్వాతంత్ర్య భారత దేశంలో సర్వ సమానత్వాన్ని ధ్యేయంగా నిల్పుకు శ్రమించేటటువంటి పెద్దగల మన మంత్రులు అందరూ సమయాల సమావేశాల్లో గంటలోప్పేళ్ళలా లెక్చర్లు దంచడం మనం చూస్తూనే వున్నదే. నేత బ్రాసంగిల కార్యదర్శుల పుణ్యమా అని వారి లెక్చర్లకు కావలసినంత సాధన సామాగ్రి అందుతోంది. ఈ సందర్భాల్లో ఆహ్వానాలు పంపబడతాయి. అలంకరణలు చేయబడతాయి. కుర్చీలు బల్లలు వేర్పబడతాయి. పూల ఉపయోగ మేమిటో అప్పుడే తెలుస్తుంది. ఉపాహారాలు సరే సరి. ఈ సమావేశంలో విశేష ఆకర్షణ అతిథి దేవుడు. వారి కోసం జనం ఎగబడతారు. గౌరవనీయులైన మంత్రిగారు కారులో దిగుతారు. ఆహ్వాన సంఘం ఆయున్ను సాదరంగా పూలదండల్లో ముంచేస్తుంది. ఫోటో గ్రాఫర్లు హడావిడిగా పరిగెడుతుంటారు. ఇలాంటివి ఢిల్లీ నిత్య వ్యవహారాల్లో ఒక భాగమై వూరుకున్నాయి.

ఈ వనమహోత్సవం రాను రాను ఎంతో పొదుపుగా జరిపోతావుంది. వనమహోత్సవాలు జరిపేవాళ్ళు వేరుగా మొక్కల్ని పాతేందుకు శ్రమపడి త్రవ్వక్కర్లేదు. క్రిందటి సంవత్సరం త్రవ్విన ఆ పాళ్ళను బట్టి క్రొత్తగా వనమహోత్సవానికి మళ్ళీ ప్రారంభోత్సవం చేసేయొచ్చు. అలానే జరుగుతోంది ఈ వ్యవహారం. ఈ పుణ్యపర్వ అయిన మర్నాడు ఆ పాతిన మొక్కల ముఖాన్ని చూసే దిక్కుండదు. నీళ్ళూ పోషణా లేక ఆ మొక్కలు నిరాంకురమై పోతాయి. ఇదో విషాద గాథ. కాని ఈ వన మహోత్సవం దేశ వ్యాప్తంగా భారీగా ఏర్పాటు చేయబడుతున్నమాట వాస్తవమే.

జాతీయ పారిశుధ్యవారాన్ని ప్రవేశ పెట్టారు. వాడుకలోకి తీసుకు వచ్చారు. ప్రకటనలు గోడల మీద అంటించడం ద్వారా ఇది జన వ్యాప్తమైంది. ఈ పారిశుధ్య వారం ఢిల్లీలో జన సామాన్యం మీద పనిచేసినట్లు ఎక్కడా కన్పించదు. కేంద్ర ప్రభుత్వ సచివాలయాన్ని పరిశీలించినా ఇదే భావం పొడసూపుతుంది. మేల్కొన్న మెహర్‌చంద్ ఖన్నా, రైల్వే డిప్యూటీ మినిష్టరు, లాలాషామ్‌నాథ్ గార్లకు ధన్యవాదాలు.

'రామలీలా' ప్రదర్శనాల్లో పూల ప్రదర్శన ఉత్సవం కూడా అధికార ముద్ర వేయించుకుంది. మంత్రి బంధు మిత్ర సపరివారంగా రామలీల ఉత్సవాల్లో రావణ దహనాన్ని దర్శిస్తారు రాష్ట్రపతి. ఈ పూల పండుగ కనీసం ఉపరాష్ట్రపతి భాగ్యానికైనా నోచుకున్నదై వుండాలి! మొఘల్ పరిపాలకుడు బహదూర్ షా సాంప్రదాయం ఈ సంవత్సరం మరోసారి తలెత్తింది.



కనకదుర్గ

గాంధీజయంతి, స్మారకదినము చరిత్ర ప్రసిద్ధమైన రోజులు. అక్టోబరు రెండవ తేదీన, జనవరి ముప్పయ్యవ తేదీన వార్తా పత్రికలు గాంధీగారి ఆదర్శయుత జీవనం మీద అనుబంధాలు ప్రకటించడంకద్దు. కొందరు గాంధీ భక్తులు 'స్మారకదినం' నాడు ఆయన ప్రాణాలు వదిలిన బిర్లా భవనానికి వెళ్ళి అంజలి ఘటిస్తూవుంటారు. గాంధీ సమాధి వద్ద ఈ రెండు ప్రత్యేకమైన దినాల్లోనూ సమూహ ప్రార్థనలు జరుగుతూ వుంటాయి. ఫోటోగ్రాఫర్లు రావడం గమనించి మన కాంగ్రెసు మంత్రులు రాట్నాల దగ్గర కూర్చుంటారు. గాంధీ గారిపై తమ తమ ప్రగాఢ భక్తి తాత్పర్యాల్ని వెల్లడించు కొంటూ వుంటారు. ఇప్పుడు కావలసింది ఇదికాదు. గాంధీ ఆదర్శాలకి సర్వతోముఖమైన, హృదయ పూర్వకమైన అనుసరణీయులు కావాలి. అప్పుడే కాంగ్రెసు మళ్ళీ పునర్జీవింపబడుతుంది. ఆదర్శవంత మవుతుంది.

వర్గాంతరాల గురించి మన మంత్రులు ఎంత తక్కువగా మాట్లాడితే అంత మంచిది. బిరుదాంకితులకి, ఆ యోగ్యతకు దగ్గరగా వున్నవారికి బ్రిటిష్ అజమాయిషీలో ఒక స్థానం వుండేది. కలెక్టరు గారి దివ్యసముఖంలో కూర్చునేందుకు వీరికి స్వాతంత్ర్యముండేది. 'యుక్తాసీనులు' అనే ప్రత్యేకమైన పేరుకూడా వీరికి వుండేది. ఈ బిరుద ప్రదానం సంవత్సరానికి రెండుసార్లు జరిగేది. మన కాంగ్రెసులో కూడా ఇటువంటి 'వి.ఐ.పి.' అనే తెగ ఒకటి వుంది. ఈ ప్రాముఖ్యత ఎక్కడి వరకు ప్రాకిందీ అంటే ఒక మాజీ మంత్రి గాని, మాజీ రాయబారిగాని ఒకప్పుడు పార్లమెంటులో వున్నట్లయితే వారి నివాసానికి ఒక భవనాన్ని ప్రత్యేకించాలి. ఇప్పుడు మన మంత్రులు తమ కారు దిగి 'ఎలివేటర్' దగ్గరకి నడచి రావడానికి కూడా నామోషీ పడుతున్నారు. మంత్రి గారు కారు దిగడం చూచి గేటు తెరచి వినయ విధేయతలతో అనుసరించే చప్రాసీలను చూస్తే వారికి ఏవగింపు. వాళ్ళు తోడు రావడం కంటకింపు. ఇలా వుంది మన రాజధానిలోని సర్వ సమానత్వం!

# అత్తగారి కథల్లో పద్మశ్రీ భానుమతి



''నటజీవితంలో నిమిషం తీరికలేదు!''

ఇంటర్వ్యూ:
సి. కనకాంబరరాజు

నటిగా చలనచిత్రరంగానికి అందచందాలు తీసుకువచ్చి పద్మశ్రీగా సన్మానింపబడి, రచయిత్రిగా అత్తగార్ని సృష్టించి అకాడెమీ అవార్డు పొందుకుని, తీయని గొంతుతో శ్రోతల్ని తన్మయత్వంలో ముంచెత్తుతూ— నటిగాను, రచయిత్రిగాను, గాయనిగాను ఆంధ్రుల నలరించి నారీమన్నన లందుకుంటున్న బహుముఖ కళాప్రసన్న పద్మశ్రీ భానుమతి.

విలేఖరి ప్రశ్న: మీలో రచనా వ్యాసంగం ఎలా మొదలైంది?

జవాబు: ఇది నా చిన్నతనంలో విషయం. అప్పుడు మా నాన్నగారితో పాటు యింకా చాలామంది కవులు పండితులు మాయింట్లో యిష్టగోష్టి జరుపుకుంటూ వుండేవారు. నాకూ చిన్నప్పటి నుంచి చదువంటే మంచి ఆసక్తి. వాళ్ళొకోసారి చదివే 'గడగడమనే' పద్యాలు నాకంతగా అర్థంకాకపోయినా విని లవి కుతూహలంగా వుండేది. అయితే నాలో యీ అభిరుచిని కనిపెట్టి, అంతర్గతంగా వున్న రచన చేయగల శక్తిని వెలికి తీసుకు రావడానికి శ్రీ విశ్వనాథ కవిరాజు ముఖ్య కారకులయ్యారు. ఆయన నాచేత కథలు రాయించేవారు. నేను రాసేదాన్ని. వాటిల్లో తప్పొప్పులు చూపిస్తూ నేను రచన చేయగలననే ధైర్యాన్ని ఆయన నాకిచ్చారు. అప్పట్లో పద్యాలూ గేయాలూ కూడా రాసేదాన్ని.

ప్ర: అత్తగారి కథల్ని గురించి మీ అత్తగారేమంటారు?

జ: నవ్వుతారు. నాకసలు అత్తగారి కథల్ని వ్రాయడానికి ఇన్‌స్పిరేషన్ యిచ్చింది కూడా ఆమే. ప్రోత్సహించేదీ ఆమే. మొదట్లో మా అత్తగారు 'మడి'ని గురించి తీసుకునే జాగ్రత్తను చూస్తే నాకు చాలా హాస్యాస్పదంగా వుండేది. మా అత్తగారు మడి కట్టుకున్నప్పుడు ఎవరైనా అంటితే అది ఎవరూ చూడకుండా వుంటే గమ్మునుండేవారు. ఎవరైనా చూసినట్టు పసిగడితే మట్టుకు నానాహంగామా చేసేవారు. తులసి తీర్థంతో పవిత్రమైపోయే అలాంటి భావాలమీద నాకొట్టే నమ్మకంలేదు. మా అత్తగారే కానక్కర్లేదు, సర్వసాధారణంగా జరుగుతుండే విషయాలే ఇవన్నీ. ఇవన్నీ తలుచుకున్నప్పుడు అత్తగారిలాంటి ఒక 'కేరెక్టర్'ని సృష్టించి రాస్తేనో? అన్న ఆలోచన వచ్చింది. అత్తగారి మీద నామొట్టమొదటి కథ 'మరచెంబు'. మా అత్తగారికి నేనన్నా నా రచనలన్నా ఎంతో యిష్టం. నా రచనల మీద పారితోషికం కూడా ఆవిడదే. నిత్యజీవితంలో మేమెంతో కలిసిమెలిసి వుంటాం. పేరయితే మా అత్తగారిదిగాని, నా రచనలకి ఆమెకి ఎంతో సమీప భేదం వుంది. నేను సృష్టించిన అత్తగారిలో చాలామంది అత్తగార్లు తొంగి చూస్తారు. ''చూడండి మీ కోడలు ఎలా రాస్తుందో?'' అని ఆవిడతో ఎవరన్నా ఫిర్యాదు చేస్తే నన్ను మెచ్చుకుని అది నా గొప్పతనమని తను గర్విస్తారు. కథలు గాకుండా ఒక నవల రాయమని ఎంతోమంది ప్రోత్సహిస్తున్నారు. నాకూ రాయాలనే వుంది. సంవత్సరానికి నాలుగైదు రాయలేకపోయినా తీరిక చిక్కగానే మొదలెడతాను. ఒకరు, ఈ అత్తగారి కేరెక్టరు అన్‌నాచురల్‌గా వుందన్నారు. మన నిత్యజీవితంలో పరిచయమయ్యే సన్నివేశాలకు మించి అందులో ఏంలేదు. అందులో అన్‌నాచురల్ ఏముంటుంది? నేను చేసేది ఏమిటీ అంటే, చదివేవాళ్ళకు కాస్త ఇంటరెస్టింగ్‌గా వుండేందుకూ సన్నివేశాలకి రంగులు వేస్తాను. అలాంటి అత్తగార్లు వుండకపోవడమేం? వుంటారు. నాకు చిన్నప్పటి నుంచి హ్యూమర్ అంటే బాగా యిష్టం, ఒక తరహాలో నడిపించి ఒక కేరెక్టర్‌ని నిలిపితేనే అది 'రచన' అని నేననుకుంటాను. అందుకే మునిమాణిక్యంగారి కాంతం కథలంటే నాకెంత అభిరుచి! 'అత్తగారు' ఆంధ్ర



[illegible]

**దేశాన్ని ఎంతకాలం ఏలుతుందో తెలియదు.**

ప్ర: మీ అభిమాన రచయిత(త్రు)లెవరు?

జ: నేనభిమానించే రచయితలు చాలా మంది వున్నారు. రచయిత్రి మట్టుకు శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ. నేను రచయిత్రిని గనక ఆమాత్రం చొరవ తీసకుని పక్షపాతం చూపించొచ్చుననుకుంటాను. వుంటుందండీ ఆమాత్రం వుంటుంది. మగవాళ్లను గురించి చెప్పాలంటే ఎంచేతనో తొందరగా రాదు.

ప్ర: మీ స్వంత రచనచేసి సినిమా తీయాలనుకుంటున్నారా?

జ: అంత దురాశ లేదుగాని నాకా స్వోమత వుంది. అయితే స్వంతానికి రాసుకుంది, తనే నటించింది, తనే సినిమా తీసుకుంది, తనే చూసుకోని అనే తరహాకు రాకూడదని నా వుద్దేశం. స్వయం కృషితో సినిమా తీయాలనే అభిప్రాయం నాకూ వుంది. అయితే టైం కావాలి. బుర్రలో గిర్రున తిరిగే కథను కాయితం పెట్టడానికే నాకు టైంలేదు. ఆదరాబాదరాగా చేయడం నాకంత కన్నా యిష్టం వుండదు. చూడండి, ఒకే మనిషికి ఎక్కువ కళల్లో ప్రవేశం వుండడం కూడా ఒకపెద్ద చిక్కు. నేను సినిమాల్లో నటిస్తాను. రచన చేస్తాను. సినిమారంగం ఎలాంటిదో మీకు తెలుసును కదా! నిమిషం తీరిక వుండదు. అప్పుడప్పుడు పెయింటింగ్ చేస్తూ వుంటాను. తోటపని చేస్తాను. ఇంకా సోషల్‌వర్కు అనే ఒక వ్యాసకం వుంది. ఇంటిని పూర్తిగా పనివాళ్ల చేతుల్లో పెట్టి వూరేగడం నాకిష్టముండదు. ఇంటి వ్యవహారాలు కూడా చూసుకోవాలి. ఇన్ని వ్యాపకాల్లో మనస్సును ఒకదాని మీద కేంద్రీకరించి ఆ పని సక్రమంగా నిర్వహించాలి అంటే చాల కష్టం. అంచేత స్వయంగా కథ తయారు చేసి సినిమా తీయడానికి యింకొంత కాలం పట్టొచ్చు.

ప్ర: పద్మశ్రీ, సాహిత్య అకాడమీ అవార్డు వీటిల్లో మీకు బాగా తృప్తినిచ్చింది ఏది?

జ: రెండూను.

ప్ర: ఇప్పుడు ప్రచారంలో వున్న నవలా సాహిత్యం మీద గాని కథాసాహిత్యం మీదగాని మీ అభిప్రాయం?

జ: ఒకవిధంగా చెప్పాలీ అంటే ఇప్పుడు ఈ రకం సాహిత్యం ఉన్నత ప్రమాణంలోనే వుంది. ముఖ్యంగా రచయిత్రుల్లో చక్కని **ఉత్సాహం కనబడుతోంది. అయితే ఆ వుత్సా**హం ఒక 'అవార్డు' దొరగ్గానే దాంతో చప్పగా చల్లార్చేసుకుంటే ఆ స్థాయి నిలవదు. ఇంకా కృషి చేయాలి. జనం మీద ప్రయోగాలు చేయాలి. మరింత చక్కని సాహిత్యాన్ని అందజేయాలి. ఆ ప్రశ్న నన్నే వేస్తే నా సమాధానం యీవరలోనే చెప్పేశాను. నేనొక్క రచయిత్రినేకాదు. నాకింకా



'తీరిక వేళల్లో తోటపని'

చాలా వ్యాపకాలున్నాయి. కేవలం రచయితలుగాను, లేదా రచయిత్రులుగాను పేరు తెచ్చుకున్న వాళ్ళు చేయగల్గిందెంతైనా వుంది. రచయితలు తమ తమ భావాల్ని వివిధ దృక్కోణాలకి ప్రసరింపజేసి ఉత్తమ సాహిత్యాన్ని తీసుకురావడానికి యత్నించాలి. చూడండి, సినిమాలకి సరైన కథలు దొరక్క బెంగాలీ వాళ్లపై, హిందీవాళ్లపై ఆధారపడడం నిత్యం జరుగుతూ వుంది. రచనలు సినిమాలు తీయడానిక్కూడా పనికి వచ్చేటట్టున్నప్పుడు మనకీ వెతుకులాట తప్పుతుంది 'కేవలం చదవడానికి వినడానికే కాకుండా, చూపేందుకు కూడా మన కథలు పనికి **రావాలి.'** ఇప్పుడున్న కథల్ని 'రొమాంటిక్'గా చిత్రాలు తియ్యాలంటే ఎన్నో కూర్పులూ మార్పులూ చేయాల్సి వస్తుంది. అయినా అది తగినంత ప్రమాణాన్ని అందుకోలేకపోతోంది. ఈ దృష్టితో కూడా రచనలు వెలువడితే బావుంటుందని నా వుద్దేశం. ఇది నా అభిప్రాయం మాత్రమేనండోయ్.

**'సినిమాల్లో నటించాలని నాకు లేదు, అయిష్టంగానే నటిస్తున్నాను!'**

ప్ర: మీరు సినిమాల్లో చేరటం ఎలా తటస్థించింది?

జ: ఇంతకుముందే చెప్పాను, నాకు చిన్నప్పటి నుండి చదువు మీదుండే ఆసక్తి ఎందులోనూ లేదు. పెద్ద చదువులు చదువుకోవాలని అనుకునేదాన్ని. సినిమాలంటే నాకసలు యిష్టంలేదు. సినిమా నటిగా, నా 'కెరీర్' ఎలా మొదలైందో వింటే మీకు చిత్రంగా వుంటుంది. నాకప్పుడు పద్నాలుగో ఏట. బళ్లోకెళ్లడానికి కూడా సిగ్గుపడేదాన్ని. నలుగుర్లోనూ తిరగాలంటే సిగ్గు. ఎంతసేపూ బొమ్మల పెళ్లిళ్లాడుకుంటూ వుండేదాన్ని. సినిమాలు వచ్చిన మొదటి రోజుల్ని ఒక్కసారి ఆలోచిస్తే మీకప్పటి పరిస్థితులు అర్థమవుతాయి. మా నాన్నగారు చాలా ఉన్నతాదర్శాలు గల మనిషి. ఆయనకు సంగీతమంటే మహా యిష్టం. నా పద్నాలుగో ఏట మా నాన్నగారితో పాటు నేనూ 'వరవిక్రయం'లో వేషం వేశాను. చిత్రమేమిటంటే అందులో నాకంటే పెద్ద వయస్సులో వున్నామెకు అక్కగా నటించాను. నలుగురూ ప్రశంసించారు. బొమ్మల పెళ్లి ఆటలోంచి లేవడం యిష్టంలేక, అయినా మా నాన్నగారి మాట తీసివేయలేక సినిమాల్లో వేషాలు వేశాను. ఇప్పటికీ అయిష్టంగానే వేషాలు వేస్తున్నాను. 'స్వర్గసీమ' సినిమా నుంచి మాత్రమే నేను నటన అంటే ఏమిటో అర్థం చేసుకుని నటిస్తున్నది. అదే నా మొదటి చిత్రమని చెప్పాలి. పద్నాలుగోఏట నేను సినిమాల్లో ప్రవేశించాను. ఎన్నో ఏళ్లు గడిచాయి. ఇప్పుడు ఈ రంగానికొక స్థిరత్వం వచ్చింది. అయినా 'బాల నటీనటులు' మనకు కొదవగానే వున్నారు.

ప్ర: మీరు ఒక పాత్ర ధరించడానికి ఒప్పుకునే ముందు దేన్ని ప్రధానంగా పరిశీలిస్తారు?

కథ, పాత్ర, రచయిత..?

జ: 'పాత్ర'. నాకు నచ్చినదైతేనే దాన్ని ధరించేందుకు ఒప్పుకుంటాను. ఆపాత్రకు అన్యాయం చెయ్యకుండా కథకు మరింత న్యాయం చేయడానికి నేను ప్రయత్నిస్తాను. ఒకోసారి అలాంటప్పుడు కథతో జోక్యం కలగజేసుకోవడం కూడా జరుగుతుంది. కారెక్టర్‌కి తగిన ఏక్టర్‌ని ఎన్నుకున్నప్పుడే చిత్రం విజయవంతమవుతుంది. ముఖ్యంగా నాకు హ్యూమరస్ పాత్రలంటే యిష్టం. 'డెప్త్' వుండేవని. 'నిజజీవితంలో సీరియస్‌గా కనిపించేవాళ్లు హ్యూమరస్‌గా వుండడం, హ్యూమరస్‌గా కనిపించే వాళ్లు సీరియస్‌గా వుండడం ఇలాంటివి స్వతసిద్ధాలు. 'నాలో చాలా హ్యూమర్ వుంది. నవ్వుతూ పేలుతూ వుండడమంటే నాకు సరదా! మరో విషయమేమిటీ అంటే నాకు హ్యూమరస్ పాత్ర యిచ్చినపుడు హాయిగా వేసేస్తాను. సీరియస్ కేరెక్టర్ అయితే మాత్రం నటించవలసి వుంటుంది.'

ప్ర: సినీతారల పెళ్లిళ్ల గురించి మీ అభిప్రాయం?

జ: హాయిగా చేసుకోవచ్చు. యిద్దరి మధ్య 'బెట్టర్ అండర్ స్టాండింగ్' వున్నంత వరకూ ఏ గొడవా వుండదు. ఇద్దరూ ఒకే వృత్తిలో వున్నప్పుడు ఈదిక్కూ కొంత నడలింపబడుతుంది. కాని అది వివిధ మనస్తత్వాలికీ, స్వభావాలికీ సంబంధించిన విషయం.

ప్ర: బాగా చదువుకున్నవాళ్లు తెలుగు చిత్రపరిశ్రమాభివృద్ధికి అవసరమంటారా?

జ: సినిమాలకి డిగ్రీలు అనవసరం. కల్చరు, సంస్కారం కావాలి. ఇప్పటివరకు బాగా చదువుకున్న వాళ్లే ఈ పరిశ్రమని పైకి తీసుకువచ్చారా? ఇప్పుడే పరిశ్రమ చాల తక్కువరకంగా చూడబడుతోంది. అటువంటప్పుడు వాళ్లు కూడా పరిశ్రమలో చేరి కొంత మార్పు, లేదా అభివృద్ధి చూపిస్తే మంచిదే.

ప్ర: ప్రస్తుతం మీరు నటిస్తూన్న చిత్రాలేమిటి?

జ: స్వంతంగా, ఒక బెంగాలీ పిక్చరు ఆధారంగా 'గృహలక్ష్మి' తీస్తున్నాము. హిందీలో రాజకపూర్ పిక్చరు 'మేరా నామ్ జోకర్' తో కూడా నటిస్తున్నాను. మరో పిక్చరు హిందీ, తెలుగు, అరవంలో తీస్తున్న వాసు ఫిలింస్ 'పువ్వుం పొట్టు'లో నటిస్తున్నాను.

# భానుమతి

ప్ర: సంగీత దర్శకుల్లో ఎవరి సామర్థ్యం మీద మీకు ఎక్కువ గురి?

జ: మీరలా అడక్కూడదు. ఇప్పుడు సినిమారంగాన్ని ఏ కోణంలోనుంచి చూసినా వ్యాపారం కనిపిస్తుంది.

ప్ర: మీ అబ్బాయిని నటుడుగా చేయాలనుకోవడం లేదా?

జ: లేదు, ఒకవేళ మేము అనుకున్నా వాడు ఒప్పుకోడు. సెకండియర్ మెడిసిన్ చదువుతున్నాడు. బాగా చదివించాలనే నా అభిలాష.

ప్ర: మీ పాటల్లో కొన్ని ఆకర్షించినంతగా, తదితరమైనవేవీ జనాన్ని ఆకర్షించలేకపోతున్నాయి...

జ: ఒక చిత్రంలో ఒక్కపాట బావున్నంత మాత్రాన అది నిలవదు. ఆ చిత్రంలో పాటలన్నీ బావుండాలి. అప్పుడే ఆ పాటలు జనాదరణ పొందుతాయి. ఉదాహరణకి, మల్లీశ్వరి, విప్రనారాయణ చాలు. సాధారణంగా నేను పాడే పాటల కంపోజింగ్‌లో కూడా నా ప్రమేయం వుంటుంది. అలా కాకపోతే నేనసలు పాడను. నాకు కర్ణాటక, హిందుస్తానీ క్లాసికల్ స్టైల్ సంగీతమంటే యిష్టం. ఆ కళలున్న పాటలు నేను బాగా పాడగల్గుతాను. నాకు 'యెమన్ కళ్యాణి' రాగమంటే యిష్టం. 'నా పాటలు శ్రావ్యంగా వుంటాయి' అంటే దానిక్కారణం కంపోజింగ్‌లో నేను కలగజేసుకోవడమే.

ప్ర: హైదరాబాదుకి నివాసం మార్చాలని మీరేమైనా అనుకుంటున్నారా?

జ: అటువంటి దురభిప్రాయం నాకేమీ లేదండి. ఒకిల్లంటే లాక్కుపోవచ్చు. స్టూడియో సరంజామా వుంది. అయినా నేను ఎక్కువ పిక్చర్లలో నటించేదాన్నికాదు. సంవత్సరానికో సినిమా తీస్తే తీస్తాము లేకపోతే లేదు. అలాంటిది నేనెళ్లి ప్రయోజనమేముంటుంది చెప్పండి? ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సినిమా పరిశ్రమని రాజధానిలో అభివృద్ధిపరచాలని లక్షించింది. ప్రయత్నిస్తోంది. మంచి ప్రోత్సాహాన్ని కూడా యిస్తోంది. మంచిదే. ప్రభుత్వం చేయవలసింది యింకా ఎంతో వుంది. స్టూడియోల నిర్మాణం పూర్తిచేయాలి. తగినన్ని 'ఫ్లోర్స్' వేయాలి. సరైన 'ఎక్విప్‌మెంట్' అమర్చాలి. అక్కడ షూటింగ్ మొదలెట్టి రికార్డింగ్ కోసమో, లేకపోతే యితరమైన టెక్నికల్ అవసరాల కోసమో మద్రాసు పరుగెత్తుకొస్తే ఏంలాభం? స్టూడియోలకి కావలసిన సరంజామా సిద్ధం చేసినట్లయితే అక్కడ ఈ అభివృద్ధికి ఎక్కువ ఆస్కారం వుంటుంది. నటీనటులు అక్కడ వుండిపోడానికి అవకాశమూ ఏర్పడుతుంది.

ప్ర: దసరా పండుగ రోజున మీరేం చేస్తారు?

జ: నాకు ఈ పండగ చాలా ముఖ్యమైంది. చిన్నప్పటి నుంచి బొమ్మల కొలువంటే మహా యిష్టం. చెప్పాలంటే, ఈ పండగ నాడు మళ్లీ చిన్నపిల్లనైపోతూ వుంటాను.

ప్ర: మిమ్మల్ని గర్విష్ఠి అని చెప్పుకుంటారు, నాకలాంటిదేమీ......?

జ: నేను సహజంగానే సీరియస్‌గా కనిపిస్తాను. సీరియస్‌గా కనిపించేవాళ్ళ మనస్తత్వం గురించి ముందే చెప్పాను. నన్ను గర్విష్ఠి అనుకోవడం నా దురదృష్టం. నా స్వభావాన్ని అర్థం చేసుకుంటే గదా నేను గర్విష్ఠినో మరేంటినో తెలిసికునేందుకు? విమర్శలకు నేనెక్కువ ప్రాధాన్యమివ్వను. నేనెక్కువగా వేదాంత గ్రంథాలు చదువుతాను. 'విద్యారణ్యస్వామి అన్నాడు, రాముడికంటె పెద్దవాడెవ్వడున్నాడూ అతనికే కళంకం ఆపాదించబడింది' అని. పెద్దల మాటల్ని నేను పాటిస్తాను. వాళ్లను దృష్టిలో వుంచుకునే ఏ పని చేసినా చేస్తాను. 'నాకు రైట్ పాత్' అని తెలిసిందాంట్లో నేను నడుస్తాను. అందుకోసం ఒకరికి భయపడనవసరంలేదు. నేను అనుసరించే విధానంలో తప్పు లేనప్పుడు విమర్శలను పాటించవలసిన అవసరం అంతకంటే లేదు. నేను నడిచే విధానాన్ని నేను పరిశీలించుకుంటాను. సరి చేసుకుంటాను. ముందుతరం వాళ్ళు, పెద్దవాళ్ళు నడిచిన త్రోవ అదే అయితే నాకు తృప్తి, ఆనందమూను. నా జీవిత లక్ష్యమే అది. చిన్నప్పటి నుంచి నా పద్ధతి ఇదే. అది కొందరికి నచ్చవచ్చు. మరికొందరికి నచ్చకపోవచ్చు.

ప్ర: ఈ ఇంటర్వ్యూలో మీకో అత్తగారి కథ స్ఫురించిందనుకుంటా...?

జ: 'ఇంకానయం' (నవ్వు)

ఫొటోలు: ప్రభాకర్ ●

# రాజ్యాలేలిన రాణులు



ప్రధాన మంత్రి.

నేడు మనదేశంలోకెల్లా అతిముఖ్య మయిన పదవిని ఒక స్త్రీ అలంకరించటం చూస్తున్నాము. మన ప్రధానమంత్రి రాష్ట్ర మయిన ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి కూడా ఒక స్త్రీయే! శ్రీమతి ఇందిరాగాంధి కాంగ్రెస్ నాయకురాలుగా ఎన్నిక అయినప్పుడు ఒక ప్రముఖ బ్రిటిష్ పత్రికా రచయిత్రి, "ఆమె ఆపదవికి అర్హులయిన వారందరిలోనూ పెద్దపురుషుడు (జెన్ట్సిమాన్)కాబట్టి ఎన్నిక అయ్యా"రని రాసింది. భారతదేశంలో స్త్రీల పరిస్థితి కొన్ని శతాబ్దాలుగా ఎంత హీనంగా ఉందో, ఇంకా ఎంత హీనంగా ఉందో అందరికీ తెలుసు. కాని, చరిత్ర పుస్తకాల్లో రాజ్యాలు ఏలిన ఆడవారిని గురించి చదువుతూ ఉంటాము. ఇటువంటి స్త్రీలు ఎంత మంది? స్త్రీపరిపాలన మనదేశంలో ఎంత కాలంగా ఉండేది?

ఈ ప్రశ్నలకి వివరంగా జవాబులివ్వటం తేలికకాదు! అతిప్రాచీనకాలంలో ఇక్కడ సమాజంలో ఆడవారిదే అగ్రస్థానం అన్న అభిప్రాయానికి ఎన్నో ఆధారాలు కనిపిస్తాయి. 'ఆర్యుల'రాకపూర్వం ఇక్కడ'పూజారిణు'లకు చాలా ప్రాముఖ్యత ఉండేదని ఎందరో చరిత్ర కారులు చెప్తారు. వీరు రాజ్యాలు ఏలినట్లు కనిపించదు కనుక సంస్కృతభాష వాడుకలోకి వచ్చిన తర్వాత పేరుపొందిన ఉదాహరణలని మాత్రమే గమనించవచ్చు.

గ్రీక్ రచయిత మెగస్తనీస్ 'పాండ్య' దేశంలో రాణులే పరిపాలించేవారని రాశాడుట.

అసలు రామాయణంలోనే రాముడు అడవికి వెళ్లినపుడు సీత రాజ్యాన్ని పరిపాలించాలనే సూచన వెలువడిందని సుప్రసిద్ధ చరిత్ర కారుడు శ్రీ సదాశివఖాండో ఆల్టేకర్ రాశారు. సీతాదేవి కూడా అడవులకి వెళ్లి పోయింది కాబట్టి ఈ సూచన ఫలించ లేదుట. ఇక భీష్ముడు ధర్మరాజుతో, పుత్ర సంతానం లేకుండా యుద్ధాలలో మరణించిన రాజుల వారసులుగా వారి పుత్రికలనే నియమించమని చెప్పాడని భారతంలో ఉంది.

కాని మొత్తంమీద ఇటువంటి ఉదాహరణలు వెతికితేకాని దొరకవు. రాజ్యం రాజకుమార్తెకి సంక్రమించినా ఆమె సాధారణంగా భర్తకి ఆధిపత్యం ఇవ్వడమో, లేదా అతనితో కలిసి రాజ్యం చెయ్యటమో జరిగేది. గుప్త సామ్రాజ్యస్థాపకుడు చంద్రగుప్తుడు లిచ్ఛవీ రాజపుత్రిక కుమారదేవితో బాటు కలిసి రాజ్యం చేశాడు. లిచ్ఛవులు విపరీతమయిన స్వాభిమానం కలవారు కాబట్టి ఇలా జరిగిందని కొందరి వూహ. వివాహం కాగానే రాజ్యాన్ని భర్తకి వప్పచెప్పిన వారిలో 'రట్ట' రాజకుమార్తె గౌరి ఒకామె. (10వ శతాబ్దం.)

స్వతంత్రంగా సింహాసనం అధిష్ఠించిన రాణి 9 వ శతాబ్దం చివరిభాగంలో మరణించిన ఒరిస్సా ప్రాంతపు రాజా లలితా భరణ దేవుని భార్య ఒకర్తె. పైన అన్నట్లు ఇటువంటి వారు మన చరిత్రలో అంతగా కనిపించరు!

రాజులు చిన్నవయస్సు వారవటంచేత పరిపాలన కొనసాగించలేనప్పుడు రాజమాతలు ఈ భారాన్ని తమ చేతుల్లోకి తీసుకున్న దృష్టాంతాలు మాత్రం చాలా ఉన్నాయి. అలెగ్జాండర్ని ఎదిరించిన రాజా ఒకడు మరణించినప్పుడు అతని రాణి 'మసగ'సైన్యానికి నాయకత్వం వహించింది. క్రీ. పూ. రెండవ శతాబ్దంలో శాతవాహన వంశంలో పరిపాలకురాలుగా 'నయనికా' ఎంతో కీర్తి సంపాదించుకుంది.

ఇటువంటి ఉదాహరణలకి కొదువలేదు! పృథ్వీరాజుతో బాటు రణరంగంలో మరణించిన సామరసీ రాణి కూర్మాదేవి మేవాడ్ మీద దండెత్తిన కుతుబుద్దీన్ని ఎదిరించింది. సాహసానికి మారుపేరుగా ప్రసిద్ధికెక్కిన రాజస్థాన్ చరిత్రలో ఇటువంటి ఉదంతాలు ఎన్నో ఉన్నాయి.

మరాఠీ చరిత్రలో కొల్హాపూర్కి చెందిన తారాబాయి, ఇచ్ఛల్ కరంజీ సామ్రాజ్యానికి చెందిన అనూబాయి, ఇండోర్కి చెందిన అహల్యాబాయి, ఝాన్సీ లక్ష్మీబాయి—వీరిపేర్లు అందరికీ తెలిసినవే! తారాబాయి మొఘల్ చక్రవర్తి ఔరంగజేబును ఎదిరించింది. పీష్వా బాలాజీ విశ్వనాథ్ కుమార్తె అనుబాయి స్వయంగా రణరంగంలోకి వెళ్ళింది. అహల్యాబాయి హోల్కార్, ఝాన్సీ లక్ష్మీబాయిలని గురించి వినని వారుండరు. వీరి పరిపాలనలని విదేశీయులు సహితం ప్రశంసించారు.

ఇక 'తెలుగు ప్రాంతాల'లో చాళుక్యరాణి విజయభట్టారికీ, రాష్ట్రకూట ధ్రువుడి పట్టమహిషి శీలమహాదేవి, వీరు తమంతట తామే తమ భర్తల ప్రమేయం లేకుండా దానాలు ఇచ్చినట్లు శాసనాలు ఉన్నాయి. సుప్రసిద్ధ ఇటాలియన్ దేశద్రిమ్మరి మార్కోపోలో 13వ శతాబ్దంలో ఈదేశం వచ్చినప్పుడు గుంటూరు ప్రాంతం ఒక రాణి పరిపాలన కింద ఉందని రాశాడు.. ఈ రాణి ఎవరో ఊహించటం కష్టంకాదు!

— ఎ. రుద్రాంబ

# కమ్యూనిస్టు దేశాలలో కాంగ్రెస్ అధ్యక్షుడు కామరాజ్

(గత సంచిక తరువాయి)

రష్యా యువకుడొకడు పద్దెనిమిదో యేట మాస్కో విశ్వవిద్యాలయంలో ఉన్న విద్యాభ్యాసం కోసం వెళ్ళాడు. పెక్కు కళలను నేర్చుకోవాలనే ఆ ఔత్సుక్యంతో ఆ విశ్వవిద్యాలయంలోని ఒక్కొక్క గదిలో ఒక్కొక్కరోజు వుండి, చదువుపూర్తి అయి బయటికి వస్తాడు. ఆ విధంగా ఆ యువకుడు అన్ని గదులలోను వుండి బయటికి వచ్చేటప్పుడు, అతనికి వయస్సు ఎంతో తెలుసా? పద్దెనిమిది సంవత్సరాల యువకుడు, అరవై సంవత్సరాల ముదుసలి అయి వుంటాడు.

నా మిత్రులొకరు చెప్పిన తమాషా కథ యిది! మాస్కో విశ్వవిద్యాలయం బ్రహ్మాండమైన విస్తృతని చెప్పడానికి కొంచెం అతిశయోక్తిలో ఈ కథ చెప్పారు నా మిత్రులు.



మాస్కోలో లెనిన్ అవెన్యూ

మాస్కో విశ్వవిద్యాలయం మహోత్తరమైనదే. నేడు మాస్కోలో వున్న చాల గొప్ప కట్టడాలలో ఇది కూడ ఒకటి. రష్యాదేశపు అభివృద్ధినే చిత్రించి చూపుతున్న దానివలె ఉన్నతమై, కనుల పండువుగా కట్టెదుట నిలబడుతున్నది ఈ సకల కళానిలయమైన విశ్వ విశ్వవిద్యాలయ భవనం.

మాస్కో నగరం మధ్యన ప్రవహించే మాస్కో నదీ, దాని ఇరువాగులలోను ప్రజల క్రీడోత్సవాలకు, ఈతలకు సరోవరాలు (స్విమ్మింగ్ పూల్సు) మాస్కోనగరం సిరికు మెరుగు పెడుతున్నాయి.

మాస్కోనగరం రాబడి 120 కోట్ల రూబుళ్ళు—అంటే, 960 కోట్ల రూపాయలు. ఈ రాబడి మునిసిపల్ కార్పొరేషన్ నిర్వహించే కార్ఖానాలు, రాకపోకల సాధనాలు, హోటళ్ళు, రెస్టారెంట్లు, దుకాణాలు, సినిమా థియేటర్లు మొదలయిన వాటినుంచే వస్తున్నది. దీనిలో 60 శాతం పాఠశాలలు, ఆస్పత్రులు, ఇళ్ళు కట్టడానికి వినియోగిస్తారు. మునిసిపల్ కార్పొరేషన్ సభ్యుల ఎన్నిక రెండేళ్ళ కొకమారు జరుగుతుంది. ప్రస్తుతం 1014 మంది సభ్యులున్నారు. వీరిలో సగానికి పైగా కార్మికులు. తక్కిన వారు ఉపాధ్యాయులూ, వైజ్ఞానికులు, సాంస్కృతికసేవకులు, పత్రికా సంపాదకులు మొదలయినవారు. మొత్తం సభ్యులలో 47 శాతం స్త్రీలు.

మాస్కో సమీపంలో వున్న గృహనిర్మాణ కర్మాగారానికి కామరాజ్‌ను తీసుకుని వెళ్ళారు మేయరు.

సోవియట్ యూనియన్‌లో గృహ నిర్మాణ వృత్తి చాల గొప్పగా పురోగతి పొందింది. ఇరవై రోజులలో 200 ఇళ్ళు నిర్మించడానికి తగిన సాధనసంపద వారివద్ద వున్నది. మంత్రశక్తి అనుకునేరు. కాదు. మొదట్లోనే తయారు చేసి సిద్ధపరచుకొన్న కిటికీలు, తలుపులు, గోడలు మొదలయిన సాధనాలతో వారు త్వరలో ఇళ్ళు కట్టగలరు.

'ప్రీ ఫ్యాబ్రికేటెడ్ హౌసింగ్' అనే పద్ధతిలో గోడలు, తలుపులు మొదలయిన వాటిని హెచ్చుగా మొదట్లోనే తయారుచేసి పెట్టుకుంటారు. గృహనిర్మాణ పథకం ప్రారంభం కాగానే ఆ కిటికీలు, తలుపులు, గోడలు అమర్చి, త్వరలో ఇళ్ళు కట్టివేస్తారు. ఈ కర్మాగారం అత్యంత నూతన వృత్తి సాంకేతిక సాధనాలతో నిర్మించబడింది. సిమెంట్ జల్లిని (కంకరను) ఒక గొట్టం ద్వారా తెచ్చి, కాయితాల కార్ఖానాలో కాయితాలను పోతపోసే విధంగా గోడలు, నేలలు పోత పోస్తారు. ఆ కర్మాగారం నిర్వాహకునికి సోవియట్ దేశంలో అత్యున్నతమైన "హీరో ఆఫ్ సోషలిస్టు లేబర్" అనే బిరుదు ఇవ్వబడింది.

మాస్కోలో చలి విపరీతంగా వుంటుందని మద్రాసులోనే కొందరు మమ్మల్ని భయపెట్టారు గదా! అయితే, నిజానికి మేము మాస్కో చేరినప్పుడు, మద్రాసు శీతోష్ణస్థితే అక్కడా వుండేనది. రాత్రి ఎనిమిది గంటలయినా వెలుగు తగ్గలేదు. మా 'దాచా' (అతిథిగృహం) కిటికీలన్నిటిని తెరిచిపెట్టి, మద్రాసులో పడుకున్నట్టు పడుకున్నాము.

జూలై 23వ తేదీ ఉదయం కామరాజ్ జార్ చక్రవర్తుల కాలంలో నిర్మితమైన క్రెమ్లిన్ భవనాన్ని దర్శించడానికి వెళ్ళారు. వేరు వేరు కాలాలలో వివిధ విధాలుగా కట్టబడిన అనేక భాగాలున్న ఆ మహాసౌధంలో కళాభండారాలు అసంఖ్యాకంగా వున్నాయి. జయా కాలాల చిత్రాలు, కళాఖండాలు దీపమాలికలు మొదలయినవన్నీ సోవియట్ దేశ సంస్కృతి వైభవాన్ని చాటుతూ వుండేవి. లెనిన్ బహిరంగసభలో ప్రసంగిస్తున్న కళాఖండం ఒకటి క్రెమ్లిన్ సౌధంలో ప్రవేశిస్తున్నప్పుడు మనకు కనిపిస్తుంది. అది 'త్రీడైమెన్షన్' చిత్రం. అంటే దూరం నుంచి చూస్తే, లెనిన్ సజీవంగా నిలబడి ప్రసంగిస్తున్నట్టు భ్రాంతి కలుగుతుంది. పెక్కురోజులు చూచినా, పూర్తిగా చూచినట్టు చెప్పజాలని ఈ మహాసౌధాన్ని రెండు గంటలలో చూశారు కామరాజ్.

[illegible]
మిచ్చే సభాంగణం, సుప్రీం సోవియట్ సమావేశమయ్యే సభాస్థలి, జార్ చక్రవర్తులు నివసించిన ప్రదేశాలు, వారు పూజించిన మేరీమాత ఆలయాలు అన్నిటినీ చూశాము.

సుప్రీం సోవియట్ సమావేశమయ్యే సభాస్థలి ఇంచుమించు మహాదుర్గం వంటి ఒక సమయంలో కూర్చోవడానికి తగిన వసతి కలిగివుంది. ఏ భాషలో మాట్లాడినా రష్యా భాషలో భాషాంతరీకరణమయ్యే యంత్రసాధనాలు అక్కడ అమర్చబడి వున్నాయి.

కామరాజ్‌ను పిలుచుకొని వెళ్ళిన సుప్రీం సోవియట్ అధ్యక్షుడు స్పిరిడనోవ్ ఆసియా ప్రాంతపు ప్రతినిధులు ఆసియా భాషలలోనే ప్రసంగిస్తారని, అది వెంటవెంటనే రష్యన్ భాషలో అనువాదితమవుతుందని కామరాజ్‌కు తెలియజేశారు.

లెనిన్ నివసించిన గదిని, ఆయన వుపయోగించిన వస్తువులను చూశాము. చాల నిరాడంబర పద్ధతిలోవున్న చిన్న గది. రెండుమూడు పాత కుర్చీలు, బల్లలు తప్ప మరే ఆడంబరమైన వస్తువులు అక్కడ కనిపించలేదు. అక్కడ వున్న గ్రంథాలయములో పెక్కు భాషల పుస్తకాలు కనిపించాయి. లెనిన్‌కు పెక్కు యూరోప్ భాషలు వచ్చు. అక్కడున్న పుస్తకాలలో భారత జాతీయ కాంగ్రెస్ చరిత్ర కూడ చోటు చేసుకుని వుండడం కామరాజ్ చూచారు.

“ఒకానొకప్పుడు సోవియట్ దేశంలో తిండి కొరత ఏర్పడి అందరికీ తగినంత ఆహారం దొరకనప్పుడు, మహానాయకుడు లెనిన్, బీదలు తినే సామాన్యమైన రొట్టెనే తిన్నారు” అని కామరాజ్‌తో అన్నారు. లెనిన్ గదిని చూచిన మీదట కామరాజ్ అక్కడున్న విజిటర్స్ బుక్కులో ఇలా వ్రాశారు:—

“లెనిన్ వసించిన స్థలం చూచి, నేను చాల సంతోషపడ్డాను. అత్యుదాత్త నిరాడంబర జీవితం గడిపిన ఆ నాయకుడు వసించిన ఈ స్థలాన్ని చూచినప్పుడు పరవశం ఏర్పడుతున్నది. వారి జీవిత విధానం కలకాలానికీ అందరికీ ఉత్సాహం కలిగించి, ఆవేశాన్ని కలిగిస్తుందని దృఢంగా విశ్వసిస్తున్నాను. కామరాజ్.”

లెనిన్ సమాధిని దర్శించడానికి రోజూ వేలసంఖ్యలో జనం క్యూలో నిలబడివుంటారు. ఈ క్యూ రోజూ కనిపించే దృశ్యం.

రచన:

## ఆర్. వెంకట్రామన్

మన నాయకులు కామరాజ్ సంప్రదాయం ప్రకారం ఒక పుష్పవలయాన్ని ఆ మహా నాయకుని సమాధిపై వుంచి నివాళులు సమర్పించారు.

సమాధి లోపల లెనిన్ దేహాన్ని అలాగే తైలాది రసాయన ద్రవ్యాలతో భద్రపరచి కాపాడుతున్నారు.

తద్రూపంతో, ప్రాణాలతో వున్నట్లుగా దర్శనమిస్తున్న ఆ నాయకుని దేహాన్ని కనగానే కామరాజ్ తమకు తెలియకుండానే “గాంధీజీని మనం ఈ విధంగా భద్రపరచుకో లేకపోయామే!” అన్నారు. మరుక్షణమే “మనకిది సాధ్యమై వుండేదా?” అని సందేహపడ్డారు.

లెనిన్ సమాధినుంచి సరాసరి రష్యా ప్రధాని కోసిగిన్‌ను చూడడానికి వెళ్ళారు



తాజిక్ రిపబ్లిక్ కమ్యూనిస్టుపార్టీ ప్రెసిడెంటు రసలోవ్‌తో శ్రీ కామరాజ్.

కామరాజ్.

ప్రేమతో మాకు స్వాగతమిచ్చి ఆ నాయకులు కామరాజ్‌ను అడిగిన మొదటిప్రశ్న “ఇక్కడ మీకు చలి వేయడంలేదా?” అనేదే.

“లేదు, ఢిల్లీలాగానే వుంది.” అన్నారు కామరాజ్. భారత ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధి రాకను గురించి మాట్లాడారు కోసిగిన్. తర్వాత రాజకీయాలను గురించి సమావేశం జరిగింది.

వియత్నాం సమస్య, విబంధ విధానం, భారత—పాకిస్తాన్ సంబంధాలు, భారతదేశ ఆర్థిక పరిస్థితి వంటి వివిధ విషయాలను గురించి ఇద్దరు నాయకులూ గంటన్నరకు పైగా సంభాషించారు. సద్భావ వాతావరణంలో జరిగిన ఆ సమావేశ సమయంలో నేను, భారత దౌత్యకార్యాలయ ప్రధానాధికారి, పట్కి, వెంకటేశ్వరన్ అక్కడ వున్నాము. పత్రికా ప్రతినిధులు ఆ సమావేశ సమయంలో లేరు.

సంభాషణ సమాప్తితో “మీ అభిప్రాయాలను మేము చాల గౌరవిస్తున్నాము. మీరు చెప్పే విషయాలు మా విశేష పరిశీలనకు వచ్చాయి. మన ఉభయదేశాల సంబంధాలు దృఢతరం కావడానికి మేము ఏమి చేయడానికయినా సిద్ధంగా వున్నాము” అన్నారు కోసిగిన్.

ఆ మధ్యాహ్నం సుప్రీం సోవియట్ కమిటీ సభ్యులు కామరాజ్‌కు విందు చేశారు. సుప్రీం సోవియట్ అధ్యక్షుడు స్పిరిడనోవ్ ఎంతో హృదయపూర్వకంగా ప్రసంగించారు. “భారత రష్యాల మధ్య వున్న సంబంధబాంధవ్యాలు అభివృద్ధి కావాలి. ఈ సత్సంబంధాలు అభివృద్ధి చెంది బలపడితేనే ప్రపంచశాంతిని రూపొందించవచ్చు” అన్నారు.

సన్మానానికి సమాధానంగా కామరాజ్ ఈ విధంగా అన్నారు: “ఈ విందులో పాల్గొంటున్నందుకు నేను చాల సంతోషిస్తున్నాను. రష్యా విప్లవమే ప్రపంచంలో బానిసగా వున్న దేశాలకన్నిటికీ ఒకవిధమైన చైతన్య భావం కలిగించింది. మన రెండు

దేశాలూ ప్రపంచ శాంతికి పాటుపడు తున్నాయి. ఈ కారణంగా మన సంబంధాలు బలపడడం ప్రపంచశాంతికి చాల అవసరం..''

కామరాజ్ రష్యా పర్యటనలో రెండవ రోజే ఒక అద్భుత విషయం జరిగింది. ఆరోజు రష్యానుంచి వెంటనే భారతదేశానికి తిరిగివచ్చారు. ఔను! ఆయన తిరిగివచ్చారు.



కాశ్మీర్ నుంచి వేయి మైళ్ళలోపున వున్న సోవియట్ భూమిలోని తాజిక్ రిపబ్లిక్‌కు వచ్చారు కామరాజ్.

కామరాజ్ కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ''ఇల్యూషన్—18'' విమానం ఆయనను, మమ్ముల్ని తాజిక్ రిపబ్లిక్ రాజధాని అయిన దుషాంబే నగరంలో దించింది.

విమానాశ్రయంలో తాజిక్ రిపబ్లిక్ సుప్రీం సోవియట్ ఉపాధ్యక్షురాలు శ్రీమతి పరిపోవా, తక్కిన నాయకులు కామరాజ్‌కు స్వాగతమిచ్చి, అతిథి భవనానికి పిలుచుకొని వెళ్ళారు.

మాతోపాటు వచ్చిన పత్రికా విలేఖరులక్కు భారత దౌత్యకార్యాలయం ప్రధానకార్యదర్శి ఏ. పి. వేంకటేశ్వరన్‌కు మరొక మేడను ఏర్పాటు చేశారు. శ్రీ ఏ. పి. వేంకటేశ్వరన్ కీర్తిశేషులు మాజీ న్యాయమూర్తి శ్రీ పి. ఎస్. పి. అయ్యర్ పుత్రుడు. ఆయనకు రష్యా భాష, తమిళ భాష బాగా వచ్చు. అందువల్ల ఆయన మాతోపాటు వుండడం మాకు ఎంతో సహాయంగా వుండినది.

మద్రాసు నగరవాసులకు సెమియోనోవ్ రూడిన్ పేరు బాగా తెలిసి వుంటుంది. రష్యా నుంచి తమిళనాడుకు వచ్చి, తమిళ భాషను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన వారు ఆయన. దాదాపు ఉదాత్తంగా తమిళం మాట్లాడే ఆ రష్యా యువకుడు మాతో పాటు పర్యటనలో వున్నారు. తమిళభాష, రష్యాభాష తెలిసిన ఆయన సేవ మాకు చాల ప్రయోజన[illegible]యింది.

తాజిక్ ప్రజలు కాశ్మీరీల లాగే వేష భాషలు, ప్రవర్తన, భావన కలవారు. తాజిక్ రిపబ్లిక్ మొత్తం జనసంఖ్య ఇరవై మూడు న్నర లక్షలు. వీరిలో 53 శాతం తాజిక్ ప్రజలు. 23 శాతం ఉజ్బెక్ ప్రజలు. 13 శాతం రష్యావారు. తక్కినవారు వివిధ జాతులవారు.

ఒకప్పుడు చాల వెనుకబడిన రాష్ట్రమైన తాజిక్ రిపబ్లిక్ ఇటీవల కొన్ని ఖనిజాలను క[illegible]న్నందున అభివృద్ధి చెందుతున్నది. ఆ ఖనిజాలలో నేలబొగ్గు, పెట్రోలు, తుత్తినాగం, సీసం మొదలయినవి పేర్కొన దగినవి. 1914లో తాజిక్ రిపబ్లిక్‌లో అక్షరాస్యులు ఐదు శాతం మాత్రమే. ఇప్పుడు అక్కడ నివసించే వారంతా అక్షరాస్యులే.

(సశేషం)

—అనువాదం, తి. రా.

(ఆనందవికటన్ సౌజన్యంతో)




## తొలిపలుకు

"బాబోయ్! నాకు లెక్కలంటే భయం. అందుకనే ఆర్ట్సు గ్రూపు తీసుకున్నాను" అనే వారికి లెక్కలు అంటే సరదా కలిగించడానికీ, "నాకు లెక్కలలో మంచి మార్కులే వస్తూ ఉంటాయి" అని రొమ్ము విరుచుకునేవారిని తప్పుడు దోవలకు ఈడ్చుకుపోయే చిత్రమైన సమస్యలు కనబరచి, మెళకువ అవసరం సుమా అని చూపించడానికీ ఈ వ్యాసాలు వ్రాశాను. ఇవి అర్థం అవడానికీ, స్వయంగా ప్రయత్నించి సాధించడానికీ గణితంలో పెద్ద ప్రావీణ్యం ఏమీ అవసరంలేదు. ఇందులో కేవలం తర్కంతో సాధించే సమస్యలు కొన్ని ఉన్నాయి. చూడగానే "ఇది చాలా గడ్డు సమస్యలా ఉంది. దీనికి పెద్ద పెద్ద సమీకరణాలు సాల్వు చేయాలిసిందే" అనిపించి, తీరా చూస్తే "ఇంతేనా" అనిపించే సమస్యలు కొన్ని ఉన్నాయి. చూడడానికి చాలా సులభం అని భ్రమ కలిగించి తప్పులో కాలు వేయించే సమస్యలు కొన్ని ఉన్నాయి. అన్ని సమస్యలకూ జవాబులిచ్చాను. అవసరమని తోచిన చోట్ల వివరణ లిచ్చాను.

ఇందులోవి సమస్యలు చాలా భాగం తరతరాలుగా దేశ దేశాలనుంచి బహుకాలంగా దిగుమతి అయి వస్తున్నవే. వాటిలో నాణ్యమైనవి ఏరి, ఒక చోట చేర్చి వ్రాయడం మాత్రమే నేను చేసిన పని. ఇవి తెలుగు పాఠకులందరికీ నచ్చుతాయనే ఆశిస్తున్నాను.

రచయితను గురించి నాలుగు మాటలు:

మాస్కో విశ్వ విద్యాలయంలో మూడున్నర సంవత్సరాలు కృషిచేసి 1963 లో ఫిజిక్సులో పిహెచ్.డి. డిగ్రీ తీసుకున్నారు. ప్రస్తుతం సైంటిస్టుగా పనిచేస్తున్నారు.

వీరి ఇతర రచనలు:

1. వినోదం— విజ్ఞానం (పిల్లలకోసం సైన్సు కథలు)
2. ప్రపంచానికి ఆఖరు ఘడియల్స (ఖగోళ శాస్త్రం మీద పాప్యులర్ సైన్సు గ్రంథం)
3. జీవోత్పత్తి (భూమిమీద జీవం ఎల్లా బయలుదేరిందో చెప్పే పాప్యులర్ సైన్సు గ్రంథం)
4. జీవాన్వేషణ (భూమి మీదకాక మరి ఎక్కడైనా జీవం ఉందేమో వెతికే పాప్యులర్ సైన్సు గ్రంథం)
5. విజ్ఞానచంద్రిక (పాప్యులర్ సైన్సు వ్యాసావళి)
6. వనసీమలలో (పిల్లల నవల. అనువాదం)
7. మౌల్వీనసీరుద్దీన్ కథలు. ●




వసుధర నేలిన విజయరాఘవరాయలకి తెలివైన మంత్రి కావలసి వచ్చాడు. నరసింహరాయలు తిమ్మరుసును ఎన్నుకున్న కథలు జ్ఞాపకం వచ్చాయి. తాను కూడా అటువంటి యుక్తి లెక్కలు కొన్ని ఇచ్చి, సరియైన జవాబులు చెప్పిన వాడికి మంత్రి పదవి నిస్తానని చాటింపువేయిస్తే? అవును. అదే సరియైన పద్ధతి. ఆలోచించి ఆలోచించి కొన్ని యుక్తి లెక్కలు తయారు చేశాడు.

"120 తులాలలోపున ఎన్ని తులాల సరుకు కావాలన్నా తూచి ఇవ్వగలగాలంటే వర్తకుడి దగ్గర ఏయేరకపు తూనిక రాళ్ళు కనీసం ఎన్ని ఉండాలి?" అన్న తన మొదటి ప్రశ్నను దేశమంతటా చాటింపు వేయించాడు రాజా.

చాలామంది 1,2,2,5,10,20,40, 40 తులాల బరువులు గల ఎనిమిది తూనికరాళ్ళు అవసరమని సమాధానాలు పంపించారు. కాని వెంకప్ప అనే మేధావి ఒకడు విచిత్రమైన సమాధానం వ్రాసి పంపించాడు.

"ఏలిన వారి ప్రశ్న కొంత సందిగ్ధంగా ఉంది. దీనికి రెండు విధాలుగా సమాధానాలు ఇవ్వవచ్చును.

తూచ వలసిన వస్తువును ఒక సిబ్బిలోనూ, తూనిక రాళ్లను రెండవ సిబ్బిలోనూ పెట్టాలనే నియమం కనుక ఉన్నట్లైతే 1,2,4,8,16,32,64 తులాల బరువులుగల ఏడు తూనిక రాళ్ళు చాలు. ఉదాహరణకు 53 తులాలు తూచాలంటే 1,4,16,32 తులాల రాళ్ళు వాడాలి. 71 తులాలు తూచాలంటే

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# నవలల పోటీ!

## మొదటి బహుమతి రు.3,500
## రెండవ బహుమతి రు.1,500
## మూడవ బహుమతి రు.1,000

ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకి మరింత మంచి సీరియల్ నవలలని అందచెయ్యాలనే ఉద్దేశంతో పై పోటీని నిర్వహిస్తున్నాము. రచయిత(త్రు)లందరూ ఎప్పటివలె మాతో సహకరించి పై పోటీ జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

**ముగింపు తేదీ: 31-12-1966**

## నిబంధనలు

1. పోటీకి స్వంతరచనలే పంపాలి. పంపే రచనలు తమ స్వంతమయినవే నని, అనువాదాలుకాని, అనుసరణలుకాని కాదని రచయిత(త్రు)లు వ్రాతప్రతితో బాటు హామీ పత్రాలు పంపాలి.

2. రచనలు కాగితానికి ఒకవైపునే, సిరాతో రాసిఉండాలి. 100అరఠావు (ఎక్సర్సయిజు పుస్తకం పేజికి రెండురెట్లు) పేజీలు లోపు,300 అరఠావు పేజిలు మించి ఉండరాదు.

3. నవలలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

4. వ్రాతప్రతులు 31—12—1966 లోపల మా కార్యాలయం చేరాలి.

5. వ్రాతప్రతులు, 'సంపాదకుడు ఆంధ్రసచిత్ర వారపత్రిక, తంబుచెట్టివీధి, మద్రాసు—1' కి పంపాలి.

6. కవరుమీద వ్రాతప్రతిమీద 'నవలల పోటి— 1966' అని స్పష్టంగా రాయాలి.

7. పోటీలో నెగ్గని నవలలు ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురించే హక్కు మాకు ఉంది.

8. పోటీలో నెగ్గని, ప్రచురణకి స్వీకరింపబడని నవల వ్రాతప్రతులని వీలయినంత త్వరలో, సురక్షితంగా రచయిత(త్రు)లకి తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని ఈ విషయంలో ఎటువంటి బాధ్యతనీ వహించలేము, హామీ ఇవ్వలేము. వ్రాతప్రతులతోబాటు తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామా కల కవర్లు జతపరచటం అవసరం.

9. పోటీలో తుదినిర్ణయం సంపాదకునిదే. ఈ విషయము ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరుపబడవు.

10. ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురణ పూర్తిఅయిన తర్వాత పుస్తక రూపంలో నవలని వెలువరించగోరేవారు పుస్తకంలో ప్రముఖంగా 'ఆంధ్రసచిత్ర వారపత్రికనుంచి పునర్ముద్రితం' అని పేర్కొనాలి.

## బాలసాహితి

1,2,4,64 తులాల రాళ్లు వాడాలి. ఇల్లాగే 127 తులాల లోపున ఎన్ని తులాల బరువును తూచాలన్నా ఈ ఏడు రాళ్లూ చాలు. ఇంతకన్న తక్కువ సంఖ్య తూనికరాళ్ళు ఉపయోగించడం సాధ్యం కాదు.

ఇంక రెండవ సమాధానం: తూనిక రాళ్లను రెండు సిబ్బిలలోనూ పెట్ట వచ్చునని అంగీకరిస్తే 1,3,9,27,81 తులాల బరువులు గల ఐదేఐదు రాళ్లు చాలును. ఉదాహరణకి 53 తులాల సరుకు తూచాలంటే వస్తువును ఉంచే సిబ్బిలో 27 తులాల రాతినీ, ఒక తులం రాతినీ ఉంచి, రెండవ సిబ్బిలో 81 తులాల రాతిని ఉంచి తూచాలి. 81—27—1= 53 కనుక తూగిన సరుకు బరువు 53 తులాలకు సమానం. ఇల్లాగే 121 తులాల లోపున ఎంత సరుకు కావాలన్నా ఈ ఐదు రాళ్లతోనూ తూచి ఇవ్వవచ్చు. ఇంతకన్న తక్కువ సంఖ్య రాళ్లు వాడడం అసాధ్యం.''

వెంకప్ప పంపిన ఈ సమాధానం చూచుకుని రాజు చాలా సంతోషించాడు. వెంటనే పల్లకీ పంపి వెంకప్పను తన సన్నిధికి రప్పించుకుని, ఘనంగా సత్కరించి, మరొక సమస్యను ఇచ్చాడు.

బల్ల మీద ఒకే ఆకారంలో ఉన్న మూడు డబ్బాలు ఉన్నాయి. ఒక డబ్బాలో రెండు బంగారు నాణెములు, రెండవ డబ్బాలో రెండు వెండి నాణెములు, మూడవ డబ్బాలో ఒక బంగారు నాణెం, ఒక వెండి నాణెమూ ఉన్నాయి. ఆ నాణెముల సైజు, ఆకారం అంతా ఒక్కటే. ఆ నాణెముల బరువుల భేదాలు చేతితో ముట్టుకు చూస్తే తెలియనంత స్వల్పం. చూస్తే కాని అది ఏ నాణెమో చెప్పలేరు. ఏ డబ్బాలో ఏ నాణెములున్నాయో తెలియడానికి ఆ డబ్బాల మూతలమీద "బంగారు, బంగారు", "వెండి— వెండి", "బంగారు, వెండి" అని వ్రాశారు. కావాలని రాజు ఆ డబ్బాల మూతలను తారు మారు చేసేశాడు. మూతల మీద వ్రాసిఉన్నది ఒక్కటీ నిజంకాదు. ఇప్పుడు చేయవలసిన దేమిటంటే ఆ మూడు డబ్బాలలోనూ ఏదో ఒక దాని మూత తెరిచి, లోపల ఏముందో చూడకుండా, చెయ్యి పెట్టి, ఒక్క నాణెమును బయటికి తీసి

(64 వ పేజీ చూడండి)

# ఆదుకొనే స్నేహితురాలు

















## బాధ అనేది మాకు ఒక సమస్య...చూడండి మేము మీకు ఏవిధంగా సహాయపడతామో!

**పరిశోధన :** 'ఆస్ప్రో' యొక్క పరిశోధనాసంస్థలోని ఒకపరిశోధనా దళానికి నేనుఉపదేశకుడను. బాధను అపుజేయడానికి మంచి పద్ధతులను కనిపెట్టుట మాపని. ఈ విషయమును గురించి ఏకాగ్రతతో ప్రపంచ మంతటా పరిశోధనలు జరుపు తున్న అగ్రగణ్యమైన పరిశోధనా సంస్థలలో మేము ఒకరము. నొప్పిని నివారించుటకు నేడు శ్రేష్ఠమైన క్రొత్తమార్గము 'ఆస్ప్రో' ఫార్ములా అని మేము తెలుసుకొన్నాము. అందుచేతనే ప్రపంచమంతటాడాక్టర్లచేతను, ఆసుపత్రులలోను ఇది వాడబడుతోంది.

**బాధ అంటే ఏమిటి?** మెటాబొలిక్ ఉత్పత్తులు, దేహము వాటిని తీసుకొనిపో గలిగే కంటే హెచ్చు వేగములో, స్నాయువులలో కూడుకొనిచేరి పోవడంవల్ల మరుగు పడిన వాపు కలుగుతుంది. దానితో నరములకు ఒత్తిడి కలిగి బాధ కలుగుతుంది.

**'ఆస్ప్రో' ఎలా పనిచేస్తుంది :** 'ఆస్ప్రో' దేహములో వెంటనే యిమిడి, వాపును, నరముల మీద వత్తిడిని తగ్గించి నొప్పిని వెడలగొడుతుంది.

**'ఆస్ప్రో' ను ఈ వ్యాధులకు వాడండి :** నొప్పి. తలనొప్పి. ఒంటినొప్పి . పంటినొప్పి . కీళ్లనొప్పి. జ్వరముతోకూడిన జలుబు. ఫ్లూ. కీళ్ల నొప్పులతో గూడిన జ్వరము.

**మోతాదు :**
**పెద్దవారికి :** రెండు బిళ్లలు. అవసరమైతే తిరిగి వేసుకొనండి.
**పిల్లలకు :** ఒక బిళ్లలేక మీ డాక్టరు సలహా ప్రకారము వాడండి.




**'ఆస్ప్రో'**
**నొప్పిని వెడలగొడుతుంది**

A.G.32-66 TEL




### జరిగిన కథ

మగధరాజు బింబిసారునకు ఆమ్రపాలిని తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో వైశాలికి వచ్చాడు. పాలి భవనంలో ప్రవేశించి ఆమెని ఆకర్షిస్తాడు. పాలికి బింబిసారునిపై ప్రేమ జనిస్తుంది. మహానాముడు ప్రవేశిక పుస్తకాన్ననుసరించి పాలిని నగరవధూటిని చేస్తాడు. బింబిసారుని వివాహం చేసుకున్న పాలికి తన తండ్రి నిర్ణయం తెలిసి ... ఉన్న మహానాముని వెంటకని వస్తుంది. మహానాముడు ... చేస్తాడు. ... కోసం పాలి సహాయాన్ని అర్థించడు సంజయుడు. చెలన బింబిసారుల వివాహం జరిగింది. ... లిచ్ఛవీయులు యుద్ధానికి తలపడ్డారు. పాలి కలత చెందింది. చెలన, సంజయుడూ పాలి అనుగ్రహించమని బింబిసారుని కోరారు.

## 21

'అయితే ఇంతవరకు ఈ విషయం నాతో చెప్పలేదేం సంజయా?' అని పుత్తళికను చేతిలో ఆడిస్తూ బింబిసారుడు అడిగాడు.. అతని తల వంగి ఉంది.

'మహారాజా, పాలి ఆజ్ఞ అది! ఆమె ఆత్మత్యాగాన్ని గురించి మీతో చెప్పడానికి ముందే ఆమె మీకు పత్ని అయిపోయింది. ఆ ఆత్మత్యాగాన్ని విని మీరు లిచ్ఛవీయులతో పగ సాధించడానికి నిశ్చయించి, రాజనీతిని మించిపోయి వ్యర్థంగా అసంఖ్యాకులైన నాగరీయుల రక్తాన్ని నదులుగా ప్రవహింపచేస్తారు. ఇంతేకాదు, పాలి స్వయంగా తన దేశవాసులను మీకు విరుద్ధంగా పోట్లాడడానికి ప్రోత్సహించి అకారణంగా వాళ్ళ మృత్యువుకు కారణమవుతుంది.. మహారాజా, పాలి తన భర్తను, స్త్రీ కోసం ఉన్మత్తుడయ్యే దుర్బల మానవునిగా కాక, అతన్ని నిజమైన చక్రవర్తిగా చేయగోరింది. మహారాజా, మూలోక భయంకరమైన అన్యాయం చేశారు. మిమ్మల్ని ఈ ప్రపంచంలో పాలి కంటె అధికంగా కోరే వారెవరూ లేరు... ఆమె మందహాసానికి వెనక శూన్యంలో, క్షుభితమయ్యే ఆమె హృదయముంది. ఆమె నృత్యం వెనక తన దేశాన్ని, జాతిని రక్షించు ఉత్తమ భావం ఉంది. ఆమె శరీరం నృత్యం చేత పుష్టి కలిగి సర్వశక్తి గల రసముల చేత అవశ్యం అభిషిక్తమవుతోంది. కాని, మహారాజా, ఆమె హృదయం, మనసు, మన అందరి కంటె ఉన్నతమైనవి, చాల ఉన్నతమైనవి...'

బింబిసారుడు శాంతపూర్వకంగా వింటున్నాడు. అతని పెదవులు మెల్లగా కదిలాయి. 'ఆమె నన్ను సుఖపెట్టడానికి ఇంత వేదన సహించింది. దేశాన్ని సుఖపెట్టడానికి ఆమె దేహం అర్పించింది.'

'అవును, దేవా. ఈ ప్రేమమూర్తి మీద ఇలాంటి అనేక ఆఘాతాలు పడ్డాయి. ఆమె భర్తకు దూరమై, పుత్రునితో విడివడి, జీవిత సౌఖ్యాన్ని శాశ్వతంగా వదలి తన నిజమైన కర్తవ్యాన్ని నిర్వహిస్తోంది. ఆమెనే మీరు...'

'సంజయా, నీవు నిర్దయుడవు. నీవు నన్ను దీన్నంతా ఎందుకు చెయ్యనిచ్చావు?'

'నేను నిర్దయుణ్ణి కావలసి వచ్చింది మహారాజా, కాని భర్తే భార్యని అతిసమీపం నుండి గుర్తిస్తాడు. రత్నపరీక్షకుడే వజ్రాన్ని గుర్తించలేకపోతే ఇందులో దోషం ఎవరిది?.. మీరు పాలిని ప్రేమించడం నేను ఎరుగుదును కాని, మీరు గుర్తించడం నేర్చుకోలేదు.'

సంజయుడు ఇలా అని ఊరుకున్నాడు. అతని కంఠం రుద్ధమైంది. అతడు మర్యాదను అతిక్రమించి చాలా చెప్పాడు. అయినా, బింబిసారుడంతా మౌనంతో విన్నాడు. పాలిని ప్రతివ్యక్తి ఎందుకు కోరునో ఇప్పుడతనికి తెలిసింది. ఆమె ప్రేమలో కూడుకుంది ప్రతి ఒకడు ఆమెకు పూజారి ఎందుకవుతాడు? కొంచెం సేపాగి సంజయుడు మందస్వరంతో అన్నాడు. 'క్షమించండి, మహారాజా, నేను సహించలేకపోయాను, అందువల్ల...'

'మిత్రమా, నీ మాటలు నాకు కోపం తెప్పించవు. నా కళ్ళు విచ్చుకున్నాయి. నేను చెలనను ఎందుకు మెచ్చుకున్నానో, హృదయములో ఇష్టం లేకున్నా, నేనామెను బలవంతంగా ఎలా ప్రేమించడానికి ప్రయత్నించానో నాకిప్పటికి అర్థమవుతోంది.. సంజయా, పాలి నా మనసులోనే ఆసీనయ్యి ఉంది. నేనామెను అక్కడి నుండి తొలగించడానికి వ్యర్థంగా అకార్యాలు చేశాను. ఈ విషయం నేను తెలుసుకోలేకపోయాను.. నేనొకని మీద కోపం వహించి అనేకులకు కష్టం కలిగింపగోరాను. దుఃఖితుల్ని చేశాను.'

'లేదు, మహారాజా, అలాంటి అశుభ వచనం అనకండి. మహారాజునకు అనేక మంది మహారాణులుండాలి. అది రాజ ధర్మం కూడాను.. కాని హృదయ సామ్రాజ్ఞి కావలసిన ఆమే అవుతుంది. ఆమె పట్టమహిషి అయినా లేక....'

బింబిసారుడు ఈ ఉపదేశాన్ని మాటాడకుండా వింటున్నాడు. అతడు సంజయుని సంకేతం గ్రహించాడు. కాని, ఏమీ మాట్లాడలేదు. ఇంకా ఎక్కువగా మాట్లాడడం సంజయునికి ఉచితమని తోచలేదు. చెప్పవలసిన దాన్ని అతడు చెప్పేశాడు. అతడక్కడి నుండి లేచి నమస్కరించి వెళ్ళిపోయాడు.

బింబిసారుడు విశ్రాంతి పీఠం మీద కూర్చున్నాడు. అతడు ఏకాకిగా ఉండడంవల్ల ఆలోచనలకు, భావాలకు కొంచెమైనా బాధ లేకుండా ఉంది. అతని హృదయం, మనసు, కలిసి కేక వేశాయి. 'పాలి నా కంటె గొప్పదయింది...'

అప్పుడే మరొక వైపున—

బింబిసారుడు తలపునకు రాగానే తానెంతో నిస్సహాయ అని తనలో తాను అనుభవించడం పాలి ఒక్కర్తే ఎరుగును. బింబిసారుడు ఉద్యానంలో ఒంటరిగ కూర్చున్నప్పుడు పాలి శయ్య మీద మీనంలాగ గిలగిల లాడింది.. ప్రియతముడు లభించినా, లభించనట్లే.. ఆమె బింబిసారుని చూడడానికి మాత్రమే ఏం చెయ్యలేదు! ఎన్ని కష్టాలు సహించింది! ఎన్ని విపత్తుల్ని సహించింది! లభించినప్పుడు లభించకపోతే బాగుండేదనిపించింది. వేల కొద్దీ సార్లు ఆమె తన మనస్సులో చెలనా బింబిసారుల వివాహ

దృశ్యాన్ని చిత్రించుకొని తుడిచేసింది. తన ప్రియతముని తన చేతులతో మరొకతెకు అర్పించింది!..

గడిచిన ఐదేళ్లలో ఎందరో రసిక పురుషులతో ఆమెకు సంపర్కం కలిగింది. వారి వ్యవహారం మనస్సుకు ఆకర్షించులాగ ఉంది. ఆమె ఆ నీచసుఖాన్ని అపేక్షించి ఉంటే నేడు ఆమెతో సమానమైన సౌఖ్యవంతురాలుండదు. కాని, ఆమె వందల కొలదీ మనుష్యుల్ని మూర్ఖులుగా చేసింది. మూర్ఖుల్ని చేసే కళలో ఆమె ఎంత నిపుణురాలంటే, మూర్ఖుడైన వాడికి




తాను మూర్ఖుడైనట్లు తెలియదు. ఆమె ద్వారంలో రూపము, శక్తి, సంపత్తి కల అనేక మంది రాజులు, శ్రేష్ఠులు, గృహస్థులు రూపభిక్ష అడగడానికి వస్తున్నారు. వాళ్ళ లోచనాలు మనస్సు నాకర్షిస్తున్నాయి, వాళ్ళ మాటలవల్ల మనస్సు చలిస్తోంది.

అలాటి వాళ్లతో రేయింబవళ్లు వినోదంతో కాలం గడుపుతున్నా, పాలి తన్నెట్లు సంబాళించుకోగలిగిందో ఆమెకే తెలుసు. పుత్రునితో ఎడబాటు కలిగిన తర్వాత ఈ నర్తకి జీవనక్రమంలో విచిత్రమైన మార్పు కలిగింది. పాలి నర్తకియై నర్తకి కర్తవ్యాన్ని సంపూర్ణంగా నిర్వహించడం నేర్చుకుంది. క్రమంగా ఆమెకు దుఃఖాన్ని కార్చి నవ్వడం అలవాటయింది. సంవత్సరాలు గడవడంతో పాటు ఆమె దుఃఖాలు పెరిగాయి. అయినా, వాటిని ఆమె మరిచిపోడం నేర్చుకుంది... ఇలా అయినా, ఆమె హృదయం బింబిసారుని స్మృతిని విడవలేదు. వర్షాలు గడిచాక ఆమె నేడు పతిని చూసింది. ఒకవేళ మరికొన్ని సంవత్సరాల వరకు చూడడానికి లభించడానికీయోచించి, నేటి సమాగమ విషయాన్ని వీక్షించి పాలి నిరాశలో మునిగింది. ఆమె శయ్య మీద వ్యాకులంతో పొరలాడ సాగింది. అయినా శాంతి లభించలేదు. లేచి ఆమె శయ్యపై కూర్చుంది.

ఉదయం సునేత్ర శయనగృహంలో కాలు పెట్టగానే పాలి అలాగే కూర్చుండడం చూసింది. రాత్రంతా ఆలోచించిన తర్వాత ఆమె దోషమంతా తనదే అని నిర్ధారణ చేసింది. బింబిసారు డామెను ఎందుకు చూశాడు? ఆమె తనలో చూడ తగింది ఏమి ఉంచింది?.. దీని అనంతరం కూడా, బింబిసారుడు పొరపాటునైనా ఆమె వైపు ఒకసారి ప్రేమపూర్వకంగా చూచిఉంటే ఆమె ఒంటరిపాటుగా ఉన్న సంవత్సరాల వేదన ధన్యమై ఉండెడిదని పాలి నారీ హృదయం భావించేది. ఈ ఒక్క విషయమే పాలి మనస్సు నుద్ధరిస్తోంది లేక పతితం చేస్తోంది. ఇంతలో సునేత్ర ఆమెను హెచ్చరించింది. 'దేవీ, దేవీ, అలంకరించుకో'..

'ఎందుకు, ఏమి?.. ఎవరైనా వస్తే వానితో చెప్పు. నేను..'

'దేవీ, మగధరాజు ఈ వైపు వస్తున్నారు.'

'ఆ!' అని అదిరిపడి పాలి కళ్ళు పెద్దవి చేసి చూసింది.

'అవును, దేవీ, ఈపాటి కాయన వస్తూ ఉంటారు. నేను మిమ్ము హెచ్చరించడానికి వచ్చాను. ఆలస్యం ఎందుకు.'

పాలి ఒక్కసారిగా లేచి నిల్చుండి ఉచ్ఛస్వరంతో అంది—'మూర్ఖురాలా, ఇక్కడి నుండి పో, ఆయన స్వాగతానికి ఆయత్తం చెయ్యి. ఆయన్ని సత్కరించడానికి ప్రవేశ ద్వారం దగ్గర నిల్చుండునట్లు సుభ్ర, నీవు వెళ్ళి దాసీజనంతో చెప్పండి. పో, నాయెదుట నిలబడకు!' ఇలా అని పాలి ఉల్లాసంతో, తన్ను అలంకరించుకొను త్వరతో ఇటూ అటూ పరుగెత్తసాగింది. తన యింటికి వచ్చిన అతిథిని, ప్రియతముని మనసును ఏమి ధరించి అలరింపవలెనా అన్న సంకల్ప వికల్పములలో ఆమె తన్ను మరచిపోయింది.

# ఆమ్రపాలి

ఒకనాడు నందీగ్రామంలో బింబిసారుడామెను నీలిరంగు కంచుకం ధరించుమని పట్టుబట్టినట్లు ఆమెకు జ్ఞాపకం వచ్చింది. దానిని వెదకడానికి ఆమె త్వరపడసాగింది. బింబిసారుడు తన ప్రథమ సంగమంలో ఆమె చేతులకు కట్టిన బాజూబందును ధ్యానపూర్వకంగా చూసినట్లు మళ్ళీ స్మరణకు వచ్చింది. వాటిని శుభము అని ఎంచి ఆమె ఒకదాని వెనక ఒక ఆభరణాన్ని ప్రోగుచేసి అలంకరించుకోసాగింది. ఆ సమయంలో ఆమె చాలా అస్తవ్యస్తంగా ఉండి చేతి నగలు కాళ్ళకు కాలి నగలు మెడకు ధరింపసాగింది. ఆమె శరీరమంతా కంపించ సాగింది. 'మగధ రాజు వస్తున్నాడు' అన్న శబ్దాలు నిన్న పగటి అలసటనూ, రాత్రి జాగారమునూ ఎందులో కలిసిపోయెనో తెలియదు. ప్రేమ, ప్రియుడు వీని కోసం ఉన్మత్తయై పాలి ప్రియుత ముణ్ణీ అలరించడానికి తన సర్వమూ మరచింది.

ఇంత తొందరపడినా, చాల సమయం గడిచిపోయింది. చివరకు సునేత్ర పంచధాతు దర్పణాన్ని తనకు చూపినప్పుడే ఆమె ఆగింది. కొంతసేపటి వరకు ఆమె తన్ను దర్పణంలో చూసుకుంటోంది. తరవాత ఆమె అభూషణాల నన్నింటిని ఒక్కొక్కటిగ తీసి విసరివేసింది. ఇది చూచి సునేత్ర మాటలుమాని, నోరు తెరచి పాలిని చూస్తూ ఉంది. ముంగురులు సరిచేస్తున్న పాలి దృష్టి ఆమె తండ్రి యిచ్చిన ఉంగరం మీద పడింది. ఆ ఉంగరాన్నే ధరించి తన కర్తవ్య నిర్వహణానికి హృదయం నుండి బింబిసారుని శాశ్వతంగా తొలగిస్తానని ఆమె నిశ్చయించింది.

భూషణాలను విసరి వేయడానికి ఇదే కారణం. ఆమె కూర్చుంటూ సునేత్ర నడిగింది. 'సునేత్రా, నీవు మగధరాజుతో ఏమన్నావు?'

'దేవా, దేవి అలంకరించుకొని ఇప్పుడే మీ సేవకై రాగలదని అన్నాను.'

'మూర్ఖురాలా..' పాలి అకస్మాత్తుగా లేచి కేక వేసింది.

'అంధురాలా, నా యెదుటి నుండి తొలగిపో. ఇక్కడి నుండి పో. నాకు మళ్ళీ కన్పించావంటే, జాగ్రత్త...'

'కాని, తల్లీ....'

'నోరు విప్పకు. ఈ చాతుర్యం చూపించమని నీకెవరు చెప్పారు? దుష్టా. మూగదానా, చెప్పు, మాట్లాడవేం?'

'మీ...మీరేకదా వెళ్ళి అతన్ని సత్కరించమని చెప్పారు?'

'అంధురాలా, మూర్ఖురాలా, నేను నిన్ను సత్కరించమని చెప్పానా లేక నేను కూడా వస్తానని చెప్పమని కూడా చెప్పానా? పారిపో ఇక్కడి నుండి. ఎక్కడికి పోతున్నావు? నిలబడు!'

సునేత్ర సగం చచ్చినదానిలా ఆమె దగ్గరకు వచ్చి నిల్చుంది. పాలి మొదటిలా రోషంతో అంది 'నేనిక్కడ లేనని చెప్పివెయ్యి. సుభద్ర సిద్ధమై సేవ చేయడానికి వస్తుంది.'

'కాని, లమ్మా, సుభద్ర నిన్ననే ఇక్కడి నుండి వెళ్ళిపోయింది.' 'మళ్ళీ చాతుర్యమా? నేను చెప్పిన దానిని చెప్పు. బుద్ధి ఉందా? లేక అంతా బూడిదైనదా? వెళ్ళు, నేను కోరినట్లు చెప్పు. నీకు తోచినట్లు అతన్ని ఇక్కడనుండి పంపివెయ్యి.

ఎవరూ ఎప్పుడూ పాలి ఇలా కోపంగా ఉండడం చూడలేదు. ఆమె యీ అకారణ కోపాన్ని చూచి సునేత్ర భయంతో కొన్ని నెత్తురు చుక్క లేనంతగా వాడిపోయింది. ఈ మాట్లాడుతున్నది తన ఎప్పటి స్వామిని ఆమ్రపాలో, కాక మరొకరో ఆమె కిప్పటికీ విశ్వాసం కలగలేదు. ఎలాగో ప్రాణం దక్కించుకొని ఆమె ఒక్కడి నుండి వెళ్ళిపోయింది.

పాలిని కలిసే ఉత్సాహంలో బింబిసారుని పాదాలు నేల మీద నిలవడంలేదు. సునేత్ర మళ్ళీ ఒంటరిగా తిరిగిరావడం చూసి అతడు నవ్వి మెల్లగా అన్నాడు—

'దేవి వస్తోందా?'

'ఇప్పుడే వస్తూ ఉంది. కాని నేనిది చెప్తున్నాను... కాని..'

'కాని ఏమిటి?'

'కాని, నేను మీతో ఏమన్నాను? ఆ, జ్ఞాపకం వచ్చింది. దేవి ఆమ్రపాలి ఇక్కడ లేదు. సుభద్ర ఇప్పుడే మీ సేవ కోసం వస్తోంది...' విషయం అంతటితో ముగించిందా అన్నట్లు చుట్టుప్రక్కల చూసి కేక వేయసాగింది. 'కాళీ, సుందరీ, ఎక్కడికి పోయారు...?..'

ఇలా అని ఆమె పారిపోడానికి ఉద్య

పించింది. కాని, బింబిసారుడు ఆమె చెయ్యి పట్టుకొని ఆమెను ఆపివేశాడు. ఆమెను చూసి నవ్వి, బుగ్గ మీద మెల్లగా తట్టాడు. సునేత్ర కంగారుపడి ఒక అడుగు వెనక్కి వేసింది. ఆమె నాలుక తాలువకు అంటుకు పోయింది. అప్పుడు బింబిసారుడు సునేత్ర 'వద్దు' 'వద్దు' అన్నప్పటికీ తన మెడనుంచి మూడు మాలలు తీసి, ఆమె చేతిలో ఉంచి, మెల్లగా ఆమె చెవిలో అన్నాడు. 'లోపలికి వెళ్ళి దేవికి విన్నవించు. ఆమె ఇక్కడికి రాలేకపోతే నేనక్కడికి వస్తున్నాను.'

'ఓరి బాబో, కాదు, కాదు, మహారాజా, నేను దేవితో చెప్తాను.— అనగా సుభద్రతో చెప్పాను.. అనగా.. అనగా, నేనేమి చెప్పాను? నేనేమీ చెప్పలేదు గదూ?' అని సునేత్ర ప్రాణాలు పట్టుకుని అక్కడి నుండి పరు గెత్తింది.

బింబిసారు డిక్కడికి రహస్యంగా వచ్చాడు. అతనికి ఎక్కువ సమయంలేదు. సునేత్ర వెళ్ళిపోగానే అతడు ప్రాసాదంలోని లోపలి భాగానికి పోయాడు. సునేత్ర అతని ఎదుటే గడగడ వణకుతూ నిల్చుంది. బింబిసారు డామె దగ్గరికి వచ్చాడు. ఆమె ఇప్పుడు కొంచెం కూడా అసత్యమాడలేకుండా ఉంది. బింబిసారుడు సమీపానికి రావడం చూసి ఆమె బిగ్గరగా ఏడవసాగింది. ఆ మూడు మాలలనూ బలంగా గుప్పిటిలో పట్టుకుని ఆమె అక్కడి నుండి పారిపోయింది.

సునేత్ర ఆ మారిన రూపాన్ని బింబి సారుడు చూడలేకపోయాడు. అతడు తిన్నగా శయనగృహం బంధిత ద్వారాల దగ్గరికి వచ్చి నిలబడి గొణ్ణము కొట్టి నెమ్మదిగ అన్నాడు—'పాలీ.'

పాలి లోపల నిల్చుంది సరిగా ఆ ద్వారా లకు వెనక

ఆమె ద్వారానికంటి నిల్చుంది. వెలుపల నుండి బింబిసారుని మృదుస్వరం వినిపిం చింది 'పాలీ, జడపదార్థాలు మనుష్యులను ఒకరి నుండి మరొకరిని దూరంగా ఉంచ గలవు, కాని వాళ్ళ హృదయాలను దూరం చెయ్యలేవు. తలుపు తెయ్యి.'

జవాబు రాలేదు.

'పాలీ.'

మళ్ళీ జవాబు లభించలేదు.

'పాలీ....'

పాలి నిరుత్తర అయింది.

'ప్రియే, క్షమాయాచన చేసే వారిని










క్షమించడం శిష్టవిధేయుల ధర్మం కాదా? సంజయుడు నాతో అంతా చెప్పాడు. తలుపు తియ్యి.'

పాలి జవాబేమీ ఇవ్వకుండానే ఉంది.

'పాలీ, నిన్ను మరచిపోడానికి నే నెంతో నెపం పెట్టాను. లోలోన నిన్ను తిరస్కరించాను. కాని నేడా తిరస్కారమే ద్విగుణీకృతమై నన్ను కలత పెడుతోంది. తలుపు తియ్యి.'

పాలి ఇంకా మౌనంగా ఉంది. బింబిసారుని స్వరం మందగించింది. 'పతితుడైన పతిని చూడ సిగ్గయితే తలుపు తియ్యకు, ప్రియా.. కాని ఒక దేశభర్తకి రూపంలో నన్ను చూడ్డానికి సంకోచమైతే, నా వంటి అభాగ్యుడు ఎవడూ ఉండడు. పాలీ, నీవు నా దానవు. తలుపు తియ్యి. పాలీ.'

నీవంటి దేశనాయికనుచూసి నేను గర్వానందంతో పులకితు డనవుతాను. నీ భర్త నా అదృష్టం.'

పాలి గళంలో ఎక్కిళ్ళు పుట్టాయి.. వాటిని గుప్తపరచడానికి ఆమె తన చీర చెరగు నోటిలో ఉంచుకొని నిల్చుంది. తిరిగి బింబిసారుని స్వరం వినిపించింది.. 'పాలీ, నన్ను భర్త రూపంలో కాదనుకున్నా, పుత్రుని తండ్రి అని తలచి అయినా నన్నొకసారి లోపలికి రానియ్యి. నన్నింత అభాగ్యుణ్ణిగా చెయ్యకు, పాలీ.'

ఎక్కిళ్ళి వినిపిస్తుందను భయంచేత పాలి నోరు నొక్కుకుంది. బింబిసారుని ప్రార్థనాపూర్వకమైన స్వరం మళ్ళీ వినిపించింది. 'ఏమి, నేను పూర్తిగా నీ హృదయం నుండి తొలగిపోయానా?'

ఈ ప్రశ్న విని పాలి పిచ్చిదానిలా ద్వారం పట్టుకొని నిల్చుంది. ఆమె పెదాలు కంపించాయి. 'లేదు, లేదు, నా ప్రాణనాథా, నీవు నా ప్రతి రోమంలోనూ, ప్రతి శ్వాసలోనూ ఉన్నావు.' కాని కేవలం పెదవులే కంపించి ఉండిపోయాయి. ఆమె స్వరాన్ని వెలువడనియ్యలేదు, స్వరం పని అశ్రువులు చేశాయి.

బింబిసారుని కంఠం వినిపిస్తోంది. ఆ స్వరంలో దుఃఖము, ప్రేమ, హృదయానుతాపం ఉన్నాయి. అతడన్నాడు 'నీకు నాముఖం చూపించే అధికారంలేదు. అనధికారిని చూడడం పాపమని మీ ప్రవేశిపత్రంలో చెప్పబడి ఉందని నేను విన్నాను.

# వారఫలం

**21-10-1966 శుక్రవారం మొదలు**
**27-10-1966 గురువారం వరకు.**

**మేషం :** వ్యాపారంలో మీ ఆలోచనలు మీకే కాకుండా మీమిత్రులకు కూడా లాభదాయకంగా ఉంటాయి. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో అధికారులు కూడా మీ అభిప్రాయాలను ఆమోదిస్తారు. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. బంధువులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. పోటివారితో మాటపట్టింపులకు దిగడం తగదు.

**వృషభం :** వృత్తివ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధించగలరు. అవసరానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరుతాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం :** వారంప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. మీరు యిదివరకు జరిపిన వ్యవహారాలవల్ల ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాలవిషయంలో మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

**కర్కాటకం :** వృత్తి వ్యాపారాల్లో మీశ్రమకు తగిన ప్రతిఫలం లభించగలదు. సాహసముతోకూడిన వ్యవహారాల్లో వారం మధ్యలో నష్టం వస్తుంది. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. పోటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు వస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం :** మీరు యెంతమంచిగాఉన్నా, కొన్ని వ్యవహారాల్లో అనుకోనివ్యయ ప్రయాసాలకు గురికావలసి వస్తుంది. వృత్తిలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసి వస్తుంది. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసంచేయడానికి ప్రయత్నిస్తారు. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభమూలంగా వ్యయం జరుగుతుంది.

**కన్య :** వృత్తివ్యాపారాల్లో ఆదాయం బాగానే ఉంటుంది. కాని కార్యసాధనకోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా ప్రవర్తించవలసి వస్తుంది. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. పోటివారితో మాటపట్టింపులకు దిగడం తగదు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**తుల :** వృత్తిలో యిదివరకు మీరు నిర్లక్ష్యం చేసిన వ్యవహారాలకు యిప్పుడు ప్రాముఖ్యత రావడం వలన యిబ్బంది కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు శ్రమమీద లాభిస్తాయి. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం :** మీకు యిష్టంలేకపోయినా కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో అనుకూలమైన వార్తలను వింటారు. కోర్టువ్యవహారాలు బాగా ఉంటాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాల్లో యిదివరకు ఆగిపోయిన వ్యవహారాలను యిప్పుడు లాభదాయకంగా పూర్తిచేయగలరు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరుతాయి. ఆర్థికంగా వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానేఉన్నా, బలహీనత కన్పిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మకరం :** కొన్ని వ్యవహారాల్లో మీరు భవిష్యత్తును ఆలోచించడం వలన ప్రస్తుతం తగినంత లాభాన్ని పొందలేక పోవచ్చును. వృత్తిలో పోటివారితో పోటీ తగ్గుతుంది. వ్యాపారంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతిలభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కుంభం :** కొన్ని వ్యవహారాల్లో మీరు యెంత మంచిగా ప్రవర్తించినా ఆదియితరులకు చెడుగానే కన్పిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడంవలన యిబ్బంది కలుగుతుంది. వారంమధ్యలో అనుకూలత లభిస్తుంది. పోటివారిలో గౌరవం బాగా ఉంటుంది. కుటుంబ సంతోషం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :** వృత్తివ్యాపారాల్లో మీకార్యక్రమాలు వారం ప్రారంభంలో చురుకుగా సాగుతాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు కూడా లాభిస్తాయి. వారం మధ్యలో అనుకోని చికాకులకు గురికావలసి వస్తుంది. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

—మహేష్

# హరిజన స్త్రీగా నా అనుభవాలు

ఎమ్. సత్యవతి

ఇవి గతంలో, ఏనాడో జరిగిన విషయాలు [illegible] పాఠకులు తమ హృదయాలను సరి పెట్టుకోవడానికి చూస్తారని నాకు తెలుసు. కాని యివి ఏనాటివో కాదు. 1953 నుండి 1966 వరకు, అనగా నేటికీ నేను, అనుభవించిన, అనుభవిస్తూ వున్న అనుభవాలు.

ఇవేవో, 'అగ్ర'కులాల మీద పగతో కాని, పార్టీల మీద ద్వేషంతో కాని వ్రాయడంలేదు. చిన్నతనం నుండి, యిప్పటి వరకు అడుగడుగునా, ఎదురయ్యే అవమానాలు, నాలో తీరని వేదనను నింపాయి. ఒక్కసారి యీ నా బాధలు పాఠకులకు తెలియజేయాలనివుంది. 1954 లో నేను 8 వ తరగతి చదివే రోజులు. మూడు నెలల పరీక్షలలో, ఒక సబ్జక్టులో మార్కులు తక్కువ వచ్చాయి, అన్ని సబ్జక్టులలో ప్యాసయినపిల్లలు 4,5 గురు మాత్రమే వున్నారు. యీ ఒక్క సబ్జక్టులో మార్కులు తక్కువ రావడానికి కారణం నా అనారోగ్యం. అప్పటికే ప్యాస్ కాలేదని, నా ప్రోగ్రెస్ చూసి, యింట్లో అన్నయ్య ఏమంటారో అని, నాకు భయం గానే వుంది. ఆడపిల్లలకు పెద్ద చదువు లెందుకనే భావాలతో వున్న మా నాన్న గారితో పోట్లాడి మా పెద్దన్నయ్య నన్ను చదివిస్తున్నారు. యీ మార్కులతో అన్నయ్య ముఖం ఎలాచూడాలి అని ఒక ప్రక్క నేను బాధపడ్తుంటే, అప్పుడే మా హెడ్‌మాస్టర్‌గారు క్లాసులోకి వచ్చి యిచ్చిన అమూల్యమైన సలహా— 'అమ్మాయి! ఒక సబ్జక్టులో మార్కులు తక్కువ వచ్చినందులకు నిన్ను . మేం ఏమనగలం? స్కూల్ నుండి (ప్రయివేటు స్కూల్ కేండి) ఉచితవేతనం లభించే విద్యార్థులైతే, మార్కులు తక్కువ వచ్చినందులకు ఉచిత వేతనం తీసేసే వాళ్ళం. కాని మీకు డబ్బు యిచ్చేది మేము కాదుకదా, పుణ్యానికి గవర్నమెంటు మీకు డబ్బు యిస్తూవుంది'' ఇలా ఆయన వ్యంగ్యంగా నిండు క్లాసుతో అన్నారు. ప్రభుత్వ మిచ్చే స్కాలర్‌షిప్ చూస్తూ వుంటే ఎంతో బాధ పడేవారు మా హెడ్‌మాస్టరు, మాకు వచ్చే స్కాలర్ షిప్‌ను చూచి. అదీగాక మా కుటుంబం లోని పిల్లలే ఆ స్కూల్‌లో దాదాపు పది మంది వరకు వుండేవారు. స్కాలర్ షిప్‌లో ఎక్కువ డబ్బు మా కుటుంబానికే చెందేది. ఆ విషయం హెడ్‌మాస్టర్‌గారికి సహించరాని విషయంగా వుండేది. ఇక స్కూల్‌లో జరిగే అన్ని పోటీలలో, అన్ని ఫస్టు ప్రయిజులు మా కుటుంబానికే చెందేవి. హరిజన పిల్లలకు యింత పేరురావడం బ్రాహ్మడు ఏలా సహిస్తాడు? అందుకే అవకాశం దొరికింది కాబట్టి మూడు నెలల పరీక్షలలో ఒక్క సబ్జక్టులో మార్కులు తక్కువ వచ్చాయనే నెపంతో ఆ రకంగా అవమానించారు. గాంధీజయంతి రోజు అందరికన్నాముందు వేదికనెక్కి, హరిజనులు ఎదుర్కొంటున్న కష్టాలను బాపూజీ ఉపదేశించిన మార్గాలను ధారాళంగా ఉపన్యసించేవారు. ఆ వాగ్ధాటికి పరవశమై యితని ఆదర్శాలకు మురిసి పోయిన ప్రజలు, యీయనగారిని యం.యల్.సి.గా ఎన్నుకున్నారు. ఈనాడు అతనొక గొప్ప హరిజనోద్ధారకుడు. హరిజన వాడకు వెళ్ళివస్తే, బయటనే స్నానం చేసి, మరీ యింట్లోకి వెళ్ళే మహానాయకుడు. అతడిప్పిన బట్టల్నికూడా యింట్లో నికి తేనివ్వకుండా, అటునుండి అటే చాకలి కొంపకు పంపే ఆదర్శప్రాయుడు. చాకలికొంపకు పంపడమంటె, వాడికే దానం చేయడమని తలంచెదరు పాఠకులు. చాకలివాడు వుతికి తెస్తే ఏమి 'అంటు' వుండదని వారి వుద్దేశం.

క్లాసులో పై సంఘటన జరిగిన తర్వాత ఆ హెడ్‌మాస్టర్ క్లాసంటేనే నాకు అసహ్యం కలిగింది. నిర్లక్ష్యం కూడా పెరుకు పోయింది. హెడ్‌మాస్టర్ గారి సూటిపోటీ మాటలు కూడా ఎక్కువయ్యాయి. పసి హృదయంతో నేను పై సంఘటనలను తట్టుకోలేక ప్రయివేట్‌గా మెట్రిక్ పరీక్షకు వెళ్ళా.

విద్యార్థి జీవితంలో అటువంటి సంఘటనలు ఎదురైతే, గృహిణిగా యింకా విషమ పరిస్థితి ఏర్పడింది. మా వారికి ట్రాన్స్‌ఫర్ జరగడంవల్ల వున్న వూరూ, స్వంత యిల్లూ వదిలిపెట్టి వేరే జిల్లాకు వెళ్ళడం జరిగింది. ఆఫీసులో చార్జి తీసుకొని, ఒక యిల్లంటూ సంపాదించిన తర్వాత తీసికెళ్తానని నన్ను, పిల్లల్ని మా పుట్టింట్లో వదిలి వెళ్ళారు మా శ్రీ వారు. నెలైంది, రెండు నెలలైంది. శ్రీవారి క్షేమ సమాచారంతో పాటు 'యింకా యిల్లు దొరకలే...'దనే జాబులు రావడం మొదలెట్టాయి. ''ఏం మనిషి ఈయన, రెండు నెలలైంది. నేనూ, పిల్లలూ మావాళ్ళింట్లో వుండి, మమ్మల్ని తీసు కెళ్ళాలని ఏ మాత్రం శ్రద్ధవున్నా యింత కాలంగా వెదికితే యిల్లు దొరకదా, అంత పెద్ద జిల్లాలో, పంబరిగా అలవా టయినట్టున్నారు'' యీ విధమైన ఆలో చనలతో, నా సహనం నశించి శ్రీవారికి ఘాటుగానే వుత్తరం వ్రాశా.

మా శ్రీవారికి, ఎక్కడా యిల్లు దొరికే సూచనే కనబడలేదు. అలవాటులేని హోటల్ భోజనం, ఆఫీసులో 'మకాం' నా దగ్గరి నుండి వెళ్ళే మా పైన వుత్తరాలు తెచ్చే అలజడి! ఏటూ ఆలోచించలేక మా శ్రీవారు మా దగ్గరకు రెండురోజులు సెలవు పెట్టి వచ్చారు. మా పెద్దన్నయ్య ఆ జిల్లాలో కాస్తో, కూస్తో పేరు మోసిన కాంగ్రెసు నాయకుడు. ఇంతేగాక యం. యల్. ఏ. అనే డిగ్రీ వుంది. అంతేకాక మంత్రివర్గానికి అతిసన్నిహితుడు. కాని [illegible] ప్రతివాడికీ పనులు చేసిపెట్టే అటువంటి కాంగ్రెస్ కార్యకర్త. పనులన్నీ చేయించు కొనేవరకు 'పై' కులాల దృష్టిలో కూడా ఆదర్శప్రాయుడే. ఈ జిల్లాలో, ఖాదీ ధరించుకొని మేమూ నాయకులమని చెప్పు కొనే 'అగ్ర' కులాల వారితో కాని పనులు, మా అన్నయ్య తలుచుకొంటె, చిటికెలో జరిగిపోతాయి. యింత పలుకుబడి వున్న ఒక యం. యల్. ఏ. చెల్లెనయిన నాకు యిల్లు దొరకలేదు. మా అన్నయ్య రికమండేషన్ మూలంగానైనా యిల్లు దొరుకు తుందని మా శ్రీవారు కొండంత ఆశతో వున్నారు.

రెండునెలలుగా, ఆ జిల్లాలో వుండి,

''పిసన్ని నన తపోతొల్ని చూచి వాళ్ళు కరుక్కుంటారనా మా అభిప్రాయం. వాళ్ళ కన్నా నేను ఎందులో తక్కువని తెలుస్తుంది చదువుంది. సంస్కారం వుంది, సభ్యత వుంది. వాళ్ళ రూపుల్లో ఏంతీసిపోని అందం వుంది. మీరేమి కంగారు పడనవసరంలేదు. ఆ విషయమంతా నేను చూచుకోగలను. మీరైతే కొత్త కులంతో అర్జీ అన్వేషణ ప్రారంభించడ'' ని చెప్పా.

యీ పద్ధతితో శ్రీవారి అన్వేషణ ఉత్సాహం ఫలితాలనే ప్రసాదించింది. వెంటనే ఆఫీసు నుండి క్రొత్త యింట్లోకి 'మకాం' మార్చాను.

ఈ మధ్యకాలంలో మావారికి నాలుగైదు జిల్లాలకు ట్రాన్స్‌ఫరు జరగడం, పై మంత్రంతో ఏ బాధా లేకుండా యిల్లు మారడం జరిగింది.

మావారిది కాస్త హోదా అయిన ఉద్యోగం, చదువులో కాస్త పెద్ద డిగ్రీయే వుండడం, వుంటూ వున్న యిల్లు, ఠీవి ఉత్సో, కళకళలాడుతూండడంతో ప్రక్కయిండ్ల వారి రాకపోకలు జరగడం, స్నేహాలు పెరిగిపోవడం, శ్రీవారు స్నేహితులతో సర్దాగా కాలక్షేపం చేయడం, యీ అతిక స్నేహం వల్ల ఏ అవాంతరాలు వస్తాయో అని నా గుండె ప్రతి క్షణం కొట్టుకోడం, కర్మ వశాన నేం చెప్పిన క్రొత్త కులంలో కులం తోనే ప్రక్కవీధిలో ఒకరుండటం, కులాభిమానంతో, వారు మాతో తాతముత్తాతల దగ్గరి నుండి మన రెండు కుటుంబాల, అతి స్నేహితులు అన్నంతగా, కలిసిపోవడం జరిగింది. ఈ క్రొత్త బంధుత్వంతో నాకు కాలక్షేపం బాగానే వుండేది. కాని యీనా సంతోషం చాలాకాలం నిల్వలేదు. అనుకున్న ఆపద రానేవచ్చింది. మా తమ్ముడు, మా యింటికి చుట్టపు చూపుగా వచ్చాడు.. మావాడు ఒక్కడొచ్చినా బాగుండేది. మావాడి వెనక ఒక యం. బి. బి. యస్. అనే డిగ్రీని కూడా వెంటబెట్టుకొచ్చాడు. మా దురదృష్టం వల్ల మావాడికి అంతవరకు పెండ్లి కాకుండావుండడం, అందచందాలు మాసొత్తు అనే అగ్రకులాల వారి, ఆకారం, తలదన్నే రూపురేఖలు కలిగి వుండడం, అనుకోకుండా ప్రక్కవీధావిడ (మా క్రొత్త కులంలో బంధుత్వం కలిపినావిడ) కండ్లు మావాడి మీద పడడం, మా వాడికి వారి ఒక్కగానొక్క కూతురిని వివాహం చేసేనంత ఆనందపడి పోవడం, మా యింటికి రాయబారం పంప

# హరిజన స్త్రీగా...

డం, నా తల గిర్రున తిరగడం నాలుగు రోజుల్లో జరిగాయి.

ఇంతలో నేను ఈ 'గండం' తప్పితే ఏడుకొండలవాడికి మా తమ్ముడి వెంట్రుకలు ఇప్పిస్తానని మొక్కుకుని కష్టం మీద మా తమ్ముడిని తిరుపతి పంపించి గుండు చేయించుకుని వచ్చేటట్లు చేశాను.

తెల్లవారి ప్రక్కింటావిడ కూతుర్ని వెంటబెట్టుకొని కోడలూ, ఏం చేస్తున్నావంటూ వచ్చింది. 'ఆ బాగానే వచ్చింది. యిప్పటి మావాడి ఆకారం, ఆ అమ్మాయి కండ్లబడాలని, యీ పీడా యింతటితో వదిలిపోవాలని నాకు ఆత్రుతగానే వుంది. ఎలాగో తంటాలుపడి పిలావాడిని వారిముందు నుండి వెళ్ళేట్లు చూచా. (మా వాడికి యీ విషయాలేవీ తెలియవు.) ఆ అమ్మాయి ముఖంలో రానున్నమార్పు గమనిస్తూ వున్నా. మా తమ్ముడి తల చూడగానే, ఆ అమ్మాయి ముసిముసి నవ్వులు ప్రారంభించింది. యిక ఆవిడ ముఖం చూడాలి. సంతోషంతో ''మీ అమ్మా, నాన్న ఎంత అదృష్టవంతులమ్మాయి, ఈకాలంలో, అంతటా, డాక్టరు కోర్సు చదివిన అబ్బాయిలే, యింత భక్తి వుంటదంటే, నిజంగా నాకు చాలా సంతోషంగావుంది,'' అన్నేసి ఆవిడ ఏమన్నాదో తుందో, నా చెవుల కెక్కలేదు. నాదేహంలోని రక్తమంతా ఒక్కసారిగా గడ్డ కట్టుకొనిపోయింది. కాని ఒక ఆలోచన వచ్చింది.

ప్రక్క వీధావిడ, మావాడి గుండుని చూచిన తర్వాత కలగిన ఆనందాన్ని, వెలిబుచ్చుతూనే వుంది. ''ఇటువంటి తీర్థ్రాళ్ళంటే, మావారికి చాలా యిష్టం. అమ్మాయికి కూడా భగవత్ భక్తి చాలావుంది. వెంట్రుకలివ్వినంతమాత్రాన ఏం పోయిందమ్మాయి, అబ్బాయి ముఖం చూడు యిదివరకంటె కళకళలాడుతుంది భక్తి భావంతో.''

ఇక ఊరుకుంటే యీ ధోరణి సాగుతూనే వుంటుందని, ''అవునండి మా వాడికి యిప్పుడైతే చాలా భక్తి వుంది. ఆ ఫారెన్ నుండి తిరిగొస్తే ఎలా వుంటాడో మరి, మాకంతరికి అదే భయం వుంది.'' యింకా 15 రోజుల్లో మాకు దూరమవుతున్నాడనే బాధ ఒకవైపున, తమ్ముడు ఫారెన్ వెళ్తున్నాడనే సంతృప్తి ఒకవైపునా, ''సాధ్యమైనంతగా'' గొంతు మార్చి బాధపడుతున్నట్లు చెప్పా.

ఆవిడ ఆశాలతం ఒక్కసారిగా కూలిపోవడంతో దేహమంతా విరిగిన ముక్కలై అయింది. వారంరోజులుగా అల్లుతున్న, ఆవిడ అయిదంతస్థుల మేడ, రూపు రేఖలు లేకుండా సమసిపోయింది. యిక ఎటువంటి సంభాషణా పెట్టకుండా వెంటనే ఏదో సాకు చెప్పి వెళ్ళిపోయింది. అప్పుడనిపించింది, యీనాడు మేము తమ కులమనుకొని, మా తమ్ముడిలో యిన్ని సుగుణాలు చూచినావిడ, పిల్లనివ్వడానికి సిద్ధమైనావిడ మా కులం వారిని ఏ మంటుందో నాకు తెలుసు.

''వీళ్ళ ముఖం వీళ్ళ కులానికి ఒక భక్తి కూడానా, వీళ్ళ మూలాన్నే దేవాలయాలన్నీ అపవిత్రమైనవి. అందుకే రోజురోజుకూ దేవుడి ప్రత్యక్షం కూడా తగ్గుతుంది. ఏదో ఆ గాంధీజీ మీద వున్న భక్తితో ప్రభుత్వం స్కాలర్‌షిప్‌లు యివ్వడం, వీళ్ళ విషయంలో చూచీచూడనట్లు ఆ పరీక్షాధికారులు మార్కులు వెయ్యడం, వీళ్ళ కోసం కొన్ని సీట్లు కేటాయించడం, వుంది కాబట్టి యీ గెజిటెడ్ ఉద్యోగాలు రావడం, జరుగుతుంది, అంతేకాని వీళ్ళకు పెద్ద తెలివితేటలు ఏడ్చాయా డిగ్రీలు సంపాదించుకోవడం, యీ హోదాలు రావడం'' అంటుంది.

తెలివితేటలు శక్తిసామర్థ్యాలంటే జ్ఞాపకం వస్తుంది. మా పెద్దన్నయ్య ఒక్కసారి రిజర్వుడు సీటుకు పోటీ చేసి, చాలా మెజారిటీతో కాంగ్రెసు యం. యల్. ఏ. గా ఎన్నికయ్యారు. అక్కడి జనరల్ సీటు కాంగ్రెస్ అభ్యర్థి చిత్తుచిత్తుగా ఓడిపోయారు, అప్పుడు 'అగ్రకులాలనే' వారన్నమాటలు— ''ఆ రిజర్వుడు సీటు కదా, ఆ సీటులో, కాంగ్రెసు అభ్యర్థిని ఎవ్వరిని నిలబెట్టినా గెలవడం ఖాయం. రిజర్వుడు సీటులో గెల్వడం పెద్ద ఘనతేమికాదు.''

రెండవసారి జనరల్ ఎలక్షన్స్‌లో, మా పెద్దన్నయ్య, కాంగ్రెసు అభ్యర్థిగా జనరల్ సీటుకే పోటీ చేశారు. అంతకు ముందు జనరల్ ఎలక్షన్‌లో ఆ తాలూకాలో ఆ సీటుతో ఒక ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు పోటీచేసి డిపాజిట్ కూడా పోగొట్టుకున్నారు. అందుకే ఆ సీటు కాంగ్రెసుకు రావడం (మా అన్నయ్య నిలబడినప్పుడు) అనుమానాస్పదంగానే వుంది. కాని ఆ ఎలక్షన్స్‌లో మా అన్నయ్య ప్రత్యర్థిని చాలా మెజార్టీతో ఓడించాడు. రిజర్వుడు

సీటులో గెలవడం పెద్ద ఘనతేంలేదన్న పెద్దమనుష్యులే మా అన్నయ్య వద్దకు వచ్చి "నీవు తప్పకుండా గెలుస్తావనుకున్నామయ్యా, నీవు తప్ప యింకెవ్వరైనా ఆ సీటులో ఓడిపోయేవారే, నీ తాలూకా కాకుండా, వేరే తాలూకాలో గెలవడం, నిజంగా, అది నీ సమర్థతే!'' అన్నారు.

మా అన్నయ్యతో భోజనం చేయడం సరదాగా వుంటుందనే పై పెద్దమనుష్యులు 1951 లో, మా పెదన్నయ్య ఒక స్నేహితుడి బలవంతంవల్ల ఒక డిన్నర్ పార్టీకి వెళ్తే, మా అన్నయ్య వుంటే, తాము భోజనం చేయమని, లేచిపోవడానికి సిద్ధమయ్యారు. యీనాడు కాంగ్రెసు కార్యకర్తగా చలామణి అవుతున్న ఒకవ్యక్తి మా అన్నయ్యను చాటుగా పిలిచి పరిస్థితి వివరించారట. మా అన్నయ్య ఆ డిన్నరు పార్టీ నుండి యింటికి తిరిగివచ్చారు. ఆ క్షణాన అన్నయ్య పడిన బాధ గుండె వున్నవాడినెవ్వడినైనా నలిపి వేస్తుంది. ఆ పెద్దమనుష్యులకు యీనాడు మా అన్నయ్యతో భోజనం చేయిండం సరదాగా వుంటుంది.

అది 14 సంవత్సరాల క్రింది మాట. యీనాడు మా హృదయాలు సంస్కారంతో ప్రవహిస్తున్నాయి. అస్పృశ్యతా నిర్మూలన కోసం మేము ఏనాడో కంకణం కట్టుకున్నామని, 'అగ్ర' కులాలు అనవచ్చు. అదంతా పచ్చిఅబద్ధం. ఆనాటికి యీనాటికి మార్పేంలేదు. ఇక యీ 'అగ్ర' కులాలలో వచ్చిన మార్పేమంటే అస్పృశ్యతా నిర్మూలన కోసం కట్టుకున్న కంకణాన్ని, ఇంట్లో ప్రవేశించేప్పుడు భద్రంగా తీసి యింటి బయటి తలుపుకు తగిలించి, యింటి లోపల కాలుపెడ్తారు. మళ్లీ బయటికి వెళ్లేప్పుడు, ఖద్దరు బట్టలతో సహా, ఆ కంకణాన్ని కూడా తగిలించుకుంటారు. హోదాలు నిలబెట్టుకోవడానికి ఆదర్శాలు ప్రకటించడానికి వీళ్ళు ఆడ్తే నాటకం మాత్రమే.

మా అన్నయ్యకు 'అగ్ర' కులాలవారిల్లో చాలామందితో ప్రాణస్నేహితం వుంది. మా అన్నయ్య, మంచితనాన్ని, స్నేహితాన్ని వుపయోగించుకొని, మా స్వగ్రామం నుండి హైదరాబాదుకు వచ్చి, మా యింట్లో వుండి ఒక్కనయాపైసా ఖర్చు లేకుండా పెండ్లాం పిల్లలతో సరదాగా హైదరాబాదంతా సర్వే చేసి వెళ్ళ 'అగ్ర' కులాలవారు ఎంతో మంది వున్నారు. ఇంతగా మన యింట్లో, బంధువుల లాగా వుండి వెళ్లారే, అని పొరపాటున వాళ్లింటికి వెళ్తామా, బయటి వరండాలో చాపవేసి, విధిలేక మా ముఖనా ఒకకాఫీ కప్పు పడవేసి 'యిక వెళ్తారా' అన్నట్లు చూస్తారు.

ఈ మధ్యనే, నేనొక జిల్లాపరిషత్ ఛైర్మెన్ సతీమణి యింటికి అతిథిగా వెళ్ళా. ఆవిడ నన్ను ఎంతో ఆప్యాయంగా చూచింది.(మా వారితో కొన్ని పనులు వారికి కావలసివున్నవిలెండి) నేను కాస్త సంతృప్తిగానే 'ఫీలయ్యా'. ఇంతలో ఆవిడ సంభాషణ, వాళ్లయనగారి పార్టీ మీదకు వెళ్లింది. "ఏం, కాంగ్రెసో, ఏమోనండీ! యీపార్టీ అంటూ వచ్చిందగ్గర నుండీ, యీ హరిజనులకు తలపొగరెక్కింది. ఒక్కడికైనా, కాస్త భయమూ, భక్తీ వుందా? ఒక్క ఆడదీ పొలంలోకి పనికి రానంటుంది. యీ గవర్నమెంటోళ్లు వుత్తగా కుట్టుమిషన్ యిచ్చారట. ప్రతీది, అ కుట్టే నేర్చుకుంటుండె, యిక పనికెవ్వరొస్తారు. పశువులు కాయడానికి ఒక "పోరడు" కూడా దొరకడం లేదు. పుణ్యానికి వచ్చిన పుస్తకాలాయె, యింకా పైగా అదేందో "స్కాలర్‌షిప్" లంటా. యిక పనికి రమ్మంటే వాళ్లెందుకు వస్తారు?'' ఆవిడ యీ మాటలు వినేసరికి ఒక్కసారిగా నా మనస్సు బాధతో మెలి తిరిగింది. నేను ఎవరో ఆవిడకు తెలుసు. నేను ఎవరో తెలియనట్టు నటిస్తూ ఆవిడ మాట్లాడిన మాటలు వింటే అన్పించింది. "ఒక కాంగ్రెస్ జిల్లా పరిషత్ ఛేర్మెన్ భార్య, దాదాపు 15 సంవత్సరాలుగా కాంగ్రెసు అభ్యర్థిగా పదవులు అలంకరిస్తున్న వ్యక్తి తన భార్యలో తెచ్చిన మార్పు యిదేనా?'' అని.

నెలరోజుల క్రితమే, మాకు ఒక క్రొత్త జిల్లాకు ట్రాన్సఫర్ జరిగింది. ఇల్లు దొరకడం కూడా జరిగింది. ఇంటి ఓనర్ ఐదు సంవత్సరాల క్రితం కాంగ్రెసు యం. యల్. ఏ. కదా అదే ధోరణిలో మావారు మా పెద్దన్నయ్య పేరు చెప్పారట. తెల్లవారి యిల్లు దొరకదనే కబురు మర్యాదగా ఒక మనిషితో చెప్పి పంపించారు. యీనాటికి యింకా యిటువంటి పరిస్థితి హరిజనులు ఎదుర్కొంటున్నారంటే, నిజంగా 'అగ్ర' కులాలనుకొని విర్రవీగే వాళ్ళంతా సిగ్గుతో చచ్చిపోవాలి. గాంధి జయంతి రోజు, యీ నాయకులు, తమ భార్యలతో సహా హరిజనవాడలో కన్పిస్తారు. ఇంటికి తిరిగివచ్చిన యీ హరిజనోద్ధారకులు యింట్లోకి వెళ్లకుండా బయటనే, నీళ్ళు పెట్టించుకొని స్నానం చేస్తారు. ఇది నా కళ్లతో చూచా. 'పదవుల కోసం ప్రాకులాడే వీళ్ల పనులు పైనుండి నీవు ఎలా సహిస్తున్నావు మహాత్మా!' అని నేను అనుకోని రోజుండదు.

నా బాధను, యీ అక్షర రూపంతో పాఠకులకు తెలియజేసే విద్యను కలగజేసి, ఆర్థికంగా తాను ఎన్నో కష్టాలకు గురి అవుతూ కూడా, మమ్మల్ని యీ సంఘంలో మనుష్యులుగా నిలబెట్టి యీ వ్యాసం వ్రాయడానికి అనుమతి యిచ్చిన నా పెద్దన్నయ్యకు కృతజ్ఞతతో. ●








ఎంత హుందాగ ఉందో అంత గొప్పది

# క్రొత్త ఐదు బ్యాండ్ల

# పోర్టబుల్ ట్రాన్సిస్టర్...

# బుష్ ఇటిఆర్. 117

( ఇటువంటి ట్రాన్సిస్టరు మరొకటి లేదు )




ఈ గొప్ప, క్రొత్త బుష్ ట్రాన్సిస్టరుతో స్పష్టమైన శబ్దగ్రహణం కోసం 5 బ్యాండ్లున్నాయి. మరొక్క విశేషము, ప్రపంచములో వేర్వేరు దేశాల్లో మీకు ఇంపైన కార్యక్రమాలను తప్పకుండ వినడానికి, ఆయా దేశాల్లో కాలం తెలిసికోడానికి వీలుగా అంతర్జాతీయ కాల సూచిక అమర్చబడియున్నది. ఈ రేడియోలో 8 ట్రాన్సిస్టర్లు, ఒక్క డయోడు, పెద్ద 7"×4" అంగుళాల హెవీ-డ్యూటీ స్పీకరు ఉన్నందువలన, ఇది అమోఘంగాపని చేస్తుంది. ఈ దినమే మీకు సమీపంలో యున్న డీలరు దగ్గరకు వెళ్ళి బుష్ ఇటిఆర్. 117 ను పెట్టి వినిపించమని అడగండి... ఇంకా, చక్కని యితర బుష్ రేడియోలను కూడా చూపించమని అడగండి.

# బుష్ ట్రాన్సిస్టర్స్

మూల్‌చందాని ఎలెక్ట్రికల్ అండ్ రేడియో ఇండస్ట్రీస్ లి.
సుఖసాగర్, శాండ్‌హర్స్ట్ బ్రిడ్జ్, బొంబాయి 7
ర్యాంక్ ఆర్గనైజేషన్‌తో సంయోగమయిన కంపెనీ




డిస్ట్రిబ్యూటర్లు : నారాయణ్ రేడియో స్టోర్సు, విజయవాడ-2.

వైజ్ఞానిక గాథావళి 80

— ఒక్కరే —







కుతుబ్‌మినార్ 238అడుగుల ఎత్తు కాహోలు ఉంది. అల్లావుద్దీన్ ఖిల్జీ దాన్ని చిన్నది చెయ్యడానికి యత్నించాడట. దాన్ని కూలగొట్టికాదు, దానికి 50 గజాల దూరంలో అంతకంటె ఎత్తైన మినారును కట్టించి. మొదటిఅంతస్తు పూర్తికాకుండానే అతడు చచ్చిపోయాడన్నది వేరు మాట. తిమ్మరుసును గురించి చెప్తారు ఒకకథ. ఒక గీతని గీసి దాన్ని చెరపకుండా చిన్నది చెయ్యమన్నారట అతన్ని. దాని పక్కన పెద్దగీత గీశాడట. పక్కపక్కల్ని వున్న పెద్దా చిన్నా ప్రతికృతుల వల్లనే కాక మొత్తపు దృశ్యాన్ని చూచే ప్రకృతివల్ల దానిలోని భాగాల సైజులు ఉన్నదానికంటె

---

పెద్దా చిన్నా కనబడతాయట. బొమ్మలో రెక్కల మధ్యన వున్న మూడు గీతల పొడవూ సమానమే అయినా విప్పిన రెక్కల నడివి గీతకు పొడవాగ్గా వున్నట్టూ, ముడుచుకున్న రెక్కల నడిమిది పొట్టిగా వున్నట్టూ కనిపిస్తుంది. జర్మన్ మానసిక తత్త్వవేత్త ముల్లర్ లయర్ మొట్టమొదట పట్టించాడు దీన్ని. యుద్ధంలో బాంబర్లు పెద్దా చిన్నా బాంబుల్ని శత్రుస్థావరాల మీదవేసి వచ్చి 'పెద్దబాంబుల ప్రేలుడు ఏ మందు గుండు గిడ్డంగినో పేల్చేశింది' అని వైమానికులు చెప్పడమూ వారి ఫొటోగ్రాఫులలో మట్టుకు ఆ ఆధిక్యము కనబడకపోడమూ సర్వసాధారణమట. అన్ని చిన్నబాంబుల ప్రేలుడు చూచిన మీదట పెద్దప్రేలుడు ఉన్న కన్న పెద్దదిగా కనబడుతుందట.. 3 అంకే 8 అంకే భాగాలు—పైదీ కిందిదీ సరిసమానంగా కనబడతాయి. తిరగవేసి చూస్తే తెలుస్తుంది. అడుగుభాగమే పెద్దదని. ఇళ్ల ద్వారాలూ కిటికీలూ తయారుచేసి పెట్టినప్పుడు పెద్దవిగా కనబడతాయి. గోడలతో బిగించినప్పుడు చిన్నవిగా కనబడతాయి. ఇంటి ప్లాను చూసినప్పుడు గదులు ఇంత చిన్నవా అనిపిస్తాయి' గదిపేరే లేచిన తరవాత పెద్దవనిపిస్తాయి.

ఒకొక్కప్పుడు పోలికవల్ల ఒక వస్తువు చిన్నా పెద్దాగా కనబడవచ్చు. కొండపార్శ్వములో పెరిగిన చెట్లూ, తనకన్న కొంచెం పొట్టివాణ్ణి వివాహము చేసుకున్న స్త్రీ, సెల్యులాయిడ్ బొమ్మని ఎత్తుకున్న పిల్ల అసలు సైజులో తోచరు. భరించగలిగినంత వేడి నీట్లో ఒక చెయ్యీ, ఐస్‌వాటర్‌లో ఒక చెయ్యీ పెట్టి వుంచి, కొంత సేపయాక రెండుచేతులూ గోరువెచ్చని నీటిలో పెట్టి చూస్తే ఆ నీళ్లే ఈ చేతికి చల్లగానూ ఆ చేతికి వేడిగానూ కనిపిస్తాయి. ఇద్దరు ఒకే తెలుపులో వున్న అక్కచెల్లెళ్లలో నల్లగాను తొడుక్కున్నది, తెల్లగౌను తొడుక్కున్న దానికంటె తెల్లగా కనబడుతుంది. తిరుగుడు కుర్చీ మీద కళ్లకు గంతలు కట్టి నన్ను కూర్చోపెట్టి గిరున మోటారుతో తిప్పేడు ఒకసైపు. అలాగ కొంతసేపు తిప్పి ఆపేడటా, నన్నడిగితే "వ్యతిరేకంగా తిప్పుతున్నావు" అన్నాను. పోలికవల్ల, ప్రదక్షిణంగా తిరిగి ఆగితే అది వ్యతిరేకతగా కనపడింది.

ఇవన్నీ ఇంద్రియాల దోషము వల్లనా? కావు. అయితే మన పై అనుభవాలతో దోషము లేదనగలమా? ఇది దోషముకాని 'దృష్టిదోషము.' దోషము కాదుగనక, ఈ భేషజాన్ని దృష్టిదోషము లేనివారి మీదా ప్రయోగించవచ్చును. యుద్ధకాలంలో వేసవిలోనైతే గడ్డిరంగూ చలికాలమైతే మంచురంగూ వాడతారట ఫ్యాక్టరీలకీ, రైల్వే జంక్షన్‌లకీ, ఆయుధాగారాలకీను. రంగులుపూసి, ఏదో ప్లేను నుంచి చూస్తే తోటల్లాగో ఆట మైదానాల్లాగో కనబడేటట్టు చేస్తారు. పొట్టిగా ఉన్నవారు బిగువైన దుస్తులో, నిలువు చారలున్న చీరలో, గౌనులో వేసుకుంటారు. పొడుగాటివారు వదులు వదులు గౌనులూ, అడ్డచారలవీ వేసుకోవచ్చు. బొత్తిగా సన్నగా ఉన్న పిల్లలకి బుసక గౌనులు వెయ్యడము, నప్పయుపకులు డబుల్ బ్రెస్టుకోట్లు వెయడమూ మామూలే కదూ? లావుగా ఉన్న ఆడవాళ్లు సన్నటంచు చీరలూ, సన్నపాటివారు వెడల్పంచు చీరెలూ పెద్దపెద్ద జరీ అంచుల చీరలూ కట్టుకుంటారు. మేకప్ అంతా దృష్టిదోషము లేనివారి దృష్టిని మభ్యపరచడమే కదా! సూటింగులు ధరించిన వారికి బాగా కనపడకపోయినా ఒక గజము దూరం నుంచి చూస్తే బాగుండేవి పాశ్చాత్యదేశాలలో ఎన్నోవా వున్నాయి.

చిత్రకళ అంతా దృష్టిదోషము లేనివారి దృష్టికి 'దోషము తెచ్చిపెట్టేటిదే కదా? లేకపోతే తెరమీద వేసిన రంగులు అడవి సీనుల్లాగా భవనాల్లాగా కనపడడాన్ని ఏమనాలి? దుర్యోధన మహారాజంతవాడు మయసభలో దృష్టిదోషము పట్టి ఎలాగ అయ్యాడూ? నాగరికులందరూ ఈదోషాన్ని కోరి టిక్కట్లుకొని నాటకాలు చూడడము వింతకాదా? శక్తి వుండిన్నీ షయిస్తఖాను ఆశ్వికదళము, శివాజీ కొండమీదికి తరిమినా ఆవుల గుంపు కొమ్ములకు పట్టిన దివిటీల కడకు పరిగెత్తి పూవాను నిష్ఫలయము చేయుడము వింతకాదా? మొత్తానికి దోషము గల దృష్టిదోషమే నయమనిపిస్తుంది ఈ దోషములేని దృష్టిదోషముకంటె. ●




సోఫాలో కూచొని బియాలజీ తిరగేస్తున్న జయప్రభ వంటి యింట్లోంచి వినిపిస్తున్న తల్లి మాటలు వినాలనే తహతహకు దూరంగా ఉంది. అలాటి 'కంఠశోష' దేవుడిచ్చిన అనవసరమైన వస్తువుల్లో ఒకటి. జయప్రభ లెక్కలో అంతే. అంతేకాదు. పడుచుదనం ప్రసాదించే చిరుపొగరులో ఎవరికైనా అంతే. అసలా గుణం ఉంటేనే యవ్వనానికది హుందాతనాన్ని, అందాన్ని సంతరించి పెట్టినట్టు. తన కాళ్ల వైపు మినుకు మినుకుమని చూస్తున్న కుక్కపిల్లనూ గమనించడం లేదు. ఎప్పుడు జయ భోజనం కావాలంటూ లేస్తుందా అని కాసుక్కూర్చుందది. భోజనం కాగానే తనకో చాక్లెట్టు ఇస్తుందా పిల్ల. "ఎందుకొచ్చిన పాడు చదువులు" అనుకుంది కుక్క, సరిగ్గా వంటింట్లో చంద్రమ్మ అనుకున్నట్టే.

కాని చంద్రమ్మ అనుకున్నదీ రైటు కాదు. కుక్క తలచిందీ పొరపాటు.

ఆమె అనుకున్నట్టు జయ చదవడం లేదు. అది తలిచినట్టు జయ అక్షరాల లోకంలోలేదు. వూహాలోకమని మరొకటున్నట్టు పాపం దానికి తెలీదు. చంద్రమ్మకి ఆ లోకం గురించి కొంతకాదు బాగా తెలుసు. కానీ ఇప్పటికిప్పుడు తన కూతురు ఓ నోట్సు పుస్తకంలో మన్మథాకారుణ్ణి రాజకుమారుణ్ణి చూస్తోందని తెలుసుకోడాని కావిడేం ఇంద్రుడూ చంద్రుడూ కాదు.

"భోజనానికి లేవండోయ్!" అని చిట్టి తమ్ముడు టముకు వాయించేటప్పటికి కాస్త రసభంగం అయినట్టుగానే లేచింది జయ.

"దీనికి చదువెందుకండీ! చదివింది చాలదా! ఏవిటో ఈ చదువులు! చక్కని సంబంధాలన్నీ జారిపోతున్నాయి." చంద్రమ్మ సణుగుడు భరించలేక సుందరంగారు ఇటు తిరిగి భోజనం చేస్తున్న కూతుర్ని అడిగారు. "పెళ్లి చేసుకుంటావా అమ్మా?"

"ఫో నాన్నా!"

"సరే! అమ్మాయి ఒప్పుకున్నట్టేగా.. ఇంక వేట ప్రారంభిద్దాం!" అన్నాడు సుందరరావు.

చంద్రమ్మగారి మొహం వికసించింది. వేపుళ్లు మరింతగా వడ్డించేసింది వద్దంటున్నా వినకుండా.

జయకు ప్రొద్దున్న కాలేజీ కెళ్తుంటే తారసపడిన అపరిచితుడూ, అందగాడూ కనిపించాడు కంచంలో హాసాస్తూగా.

"అలా ఉండాలి" అనుకుంది అప్రయత్నంగా.

'ఎలా? అన్నంలా కాదు!' అని నవ్వుకుంది ఎవరికీ తెలీకుండా.

గబగబ భోజనం ముగించి చాక్లెట్టు 'జానీ' నోటికి అందించి మరోటి నోట్లోకి పెట్టుకుని తన గదిలోకి వచ్చింది. తన గది దగ్గర ఏ ఎయిర్ కండిషన్డు గది పనికొస్తుంది గనక. తుల దూగ దెప్పటికీ.

వెన్నెల మంచం మీద పడకుండా నేల మీద పడుతుంది. కబోర్డు మీది తివాచీ తెచ్చి నేల మీదనే పరుచుకుంది.

చల్లని వెన్నెల శరీరాన్ని తాకుతుండగా భావాలూ వూహలూ తెల్లగా వెలుగుతున్న ఆకాశం మీదకు పరుగు తీశాయి. 'కట్నం తీసుకునే వాడైతే గొప్పా! కట్నం పుచ్చుకోకపోతే గొప్పా?' అని జయ ఆలోచించింది.

కట్నం పుచ్చుకోని వాడైతే బలే హుందాగా ఉంటాడు. లేదా కట్నం బాగా ఎక్కువగా నన్నా తీసుకోవాలి. ముష్టిలా మూడు వేలూ, నాలుగు వేలూ ఛీ బాగుండదు ఏమిటోగాని—

ఇంక పోతే అందం సంగతి ప్రతి ఆడ పిల్లకూ కలిగే ఆలోచనలే తనకూ ఉన్నాయి. చాలా అందంగా ఉండాలి. కనీసం తెలుగు సినిమా హీరోల అందమన్నా ఉండాలి. కాని సాధారణంగా ఆంధ్రుల ఆడవాళ్ళు మగ వాళ్ళ రూపాలతో రాజీపడిపోతుంటారు. పెళ్ళి ఫోటోల్లో ఎంతమంది పెళ్ళికొడు కుల్ని చూడలేదు? ఒక పెళ్ళికొడుకుని చీపి కళ్ళయితే మరొక తనివి గుడ్లగూబ కళ్ళు. ఒకడు బిక్కచచ్చినట్లు దీనంగా ఉండటం, మరొకడు కొట్టొచ్చినట్లు నిలబడటం. ఇంకో పెళ్ళికొడుకు 'నన్ను కాదు. నా పెళ్ళాన్ని చూడండి దయచేసి' అన్నట్లు ఉంటాడు. మరో అతను పెళ్ళాన్ని వెనక్కు తోసి నిలబడతాడేమో. ఆవిడ కోసం గాలించాలి. తర్వాత తమ తమ పెళ్ళాల్ని నవ్విస్తారో ఏడిపిస్తారోగాని ఆరూపాలు ఆ తంతు చూస్తే పెళ్ళి లేకపోతే హాయి కదా అనిపిస్తుంది. కాని అందగాడైతే—

కొంతసేపటికి జయ మన్మథకోటి సమాన డైన ఓ రాజకుమారుడితో విహరించి విహ రించి భువి మీదకు వచ్చింది. తనక్కూడా పెళ్ళంటే ఇంత ఇష్టమేమిటి? అని ఒక కొత్త గుణాన్ని తనలో కొత్తగా కనిబెట్టి నట్లు అమాయకంగా సిగ్గుపడింది జయ.

గోడ మీద వాచీ ఒకగంట కొట్టి జయకు అంతరాయం కలగకుండా జాగ్రత్త పడింది.

మరి గుణం మాటో? నిజంగా దీన్ని గురించి ఆలోచించడం, ఆకాశ పుష్పాలు ఎలా అందుతాయా అంటూ బెంగ పెట్టు కున్న దానితో సమానం అని జయకి, ఏమూలో తెలుసు.

అయినా మనసుకేం? అది వూహిస్తూనే ఉంది.

తనంటే చాలా ఇష్టమై ఉండాలి. అంటే అవతల ఎన్ని కొంప మునుకుపోయే పను లున్నాసరే రోజుకు రెండుసార్లన్నా తన అందాన్ని చూస్తూ పరవశించిపోతూ మాట్లాడాలి అతను. బొత్తిగా ఎదలని బాపతయితే అదో చిక్కే అవుతుందేమోనని జయకు భయం. పువ్వుల్లో పెట్టి పూజించే రకం అయితే తనొక ప్రతిమలా కదలకుండా మెదలకుండా కూర్చోవాలి.

మొత్తంమీద జయ ఊహించుకున్న వివి:

కట్నం తీసుకోనివాడు, లేదా బాగా తీసు కునేవాడు, కట్నం తీసుకోనంతమాత్రాన బికారిలా వుంటే తన కిష్టంలేదు. ఏడాక్టరో ఇంజనీరో కాకపోతే ఇంకెందుకు బ్రతుకు? ముసలివాడు కాని కలెక్టరో, సీనియర్ ఆఫీసరో అయితే మరీ సంతోషమే.

పడమటి కొండల పక్కకు చంద్రుడు దాటుకుంటేగాని నిద్రాదేవి ఆవహించలేదు జయను.

జయ ప్రశ్నలు కొన్ని సమాధానం లేకుండా అలా ఉండిపోయాయి.

కాని చంద్రమ్మగారి కోరిక తీరింది. ఎందుకో వధువుగా మౌనంతో ఉండి పోయింది జయ. అలా వుండిపోవలసిన పరిస్థితులు వచ్చి, ఆమె మాట్లాడకుండా చుట్టూ ఒక గోడను నిర్మించాయి.

* * *

"ఇప్పుడు నష్టం చెయ్యమని సీ ఉద్దే శం?"

అతను—వెంకటరమణ అన్నం ముందు నుంచి అర్థాంతంగానే అన్నట్లు కాస్త విసు గుతో లేచిపోవడం చూసి బాధపడింది జయ. తనే మందని ఈయనింత విసుక్కోవాలి? క్షణ క్షణానికీ తన మునుపటి కలలకీ ఇప్పటి నిజాలకీ తేడా మనస్సులో మెదిలి చివుక్కుమనిపిస్తున్నా ఎలాగో చిన్న చిన్న వాగ్వాదాల్తోనే సర్దుకుంటూంది. ఇంత వరకు.

"మీ కోసమనే కదా నేను చెప్తున్నది. తరుచుగా వెళ్ళి వస్తుంటారు—అది కొను క్కుంటే ఎంత హాయని"

"హాయి కాదని నేనన్నానా? డబ్బంటే మాటలా? ప్రస్తుతం చేతిలో లేదు. బ్యాం కులో తియ్యాలి. ఇంతకంటె పెద్ద అవసరం ముంచు కొచ్చినప్పుడు తెల్లమొహం వెయ్యాలి." నవ్వాడు జయను చూసి.

సెకండ్‌హేండు సైకిల్ మీద జోరున వెళ్ళిపోతున్న అతన్ని చూస్తూ తలదించుకు ఉండిపోయింది జయ చాలాసేపు.

నిజంగా చెప్పాలంటే ఓ కొత్త రాలీ సైకిల్ కొనుక్కోమని చెప్పలేకపోయేదా? కానీ కారు లేకపోతే పోయింది స్కూటర్ అయితేనన్నా హుందాగా ఉంటుందన్న భావన ప్రలోభ పెట్టకపోతే ఏం జరిగేదో?

సరిగ్గా నెలరోజుల తర్వాత కాబోలు డాబా మీద నిలబడి రమణ రాక కోసం చూస్తున్నది జయ. పరిసరాల సుందర చిత్రాలు చూస్తున్న కళ్ళు రోడ్డు మీదకూ మాటిమాటికి చూస్తున్నాయి. ప్రొద్దుటి నుంచి ఎందుకో ఏణ్ణర్ధం కిందటి తన కలలు గుర్తువచ్చి మనస్సును తెరచి వెళ్ళి పోతున్నాయి.

ప్రక్కనొక రాడ్ను అల్లుకున్న మల్లెతీవె ఆకాశాన్ని అందుకునే ప్రయత్నం చేస్తుంది. అప్పుడప్పుడే పైకొచ్చిన నెలరాజు మీద ఎవరో నల్లటి తివాసీ పరుస్తూ కాస్సేపు ఇతర చింతనల్లోంచి మనుషుల్ని మళ్ళి పెడుతున్నారు.

ఇలా ఎదురు చూస్తుండే తన కలలెంత కళ్ళలు అనిపిస్తోంది. అప్పటి కల ఏమి టంటే తానిలా నిలబడి కారు శబ్దం కోసం ఒళ్ళంతా చెవులు చేసుకుని వింటుం డగా అతను వస్తాడు స్వయంగా డ్రైవ్ చేసుకుంటూ. పెంకితనానికి తను పరుగెత్తే దాకా హార్న్ మోంచి చెయ్యి తియ్యడు. చిరునవ్వుతో దిగి లోపలికి వస్తాడు. అతని బూటు ధ్వనితో హాలుకో అందం వస్తుంది. అప్పటికే ముస్తాబయి ఉన్న తనను చూస్తూ ముగ్ధుడై ఏదేదో వర్ణిస్తాడు. తను నవ్వు తుంది. టీ, టిఫిన్ తీసుకుని ఇద్దరూ షికార్లకు బయల్దేరిపోతారు. అందరి దృష్టి తమ మీదే.

ఎంత పిచ్చి! ఇప్పుడు ఆతని ఉద్యోగం గురించి ఎవ్వరూ అడగరు. అథవా అడిగినా సిగ్గుతో తను చచ్చిపోతున్నది. కారు లేనే లేదు. స్కూటరన్నా ఉంటే ఎంత అందం? ఒక్క రేడియో తప్ప మరో ట్రాన్సిస్టరేనా లేదు. పోనీ ఇక్కడ రేడియో పాడుతుంటే అల్లంత దూరానికి వినిపించడానికి చిన్న అందమైన స్పీకరన్నా లేదు. బొత్తిగా అన్యాయం కాకపోతే ఏమిటిది? పెళ్ళి కాకముందు తను సృష్టించుకున్న సౌధం కాదీ ఇల్లు. కనీసం అక్కడికి చేరుకుందా మన్నా చెప్ప శక్యంగానంత దూరంగా ఉందా సౌధం.

సైకిల్ మీద గుట్టు చప్పుడు కాకుండా ఎప్పుడు వచ్చాడో ఏమో జడ పట్టుకుని లాగేవరకు తెలివి రాలేదు జయకి.

"ఎప్పుడొచ్చారు?" అనేసింది అప్రయ త్నంగా.

"ఏమిటా పరవశత్వం మరి?" అన్నాడు రమణ.

"సినిమాకు రెడీయేనా?"

"చూసుకోండి!"

"ఓహో! నా కిష్టమైన చీరే కట్టు కున్నావే!"

ఈయన తన అందాన్నెప్పుడు చూశాడు అసలు? చీరల్నయినా గమనిస్తాడు గాని

# కలలు

తన అందాన్ని చూడడు. ఏదో పెళ్ళయిన తర్వాత మూడునెలలు వర్ణించాడేమో, తెగ? అందులోనైనా ఆవేశమే తప్ప పొగడ్త ఎక్కడుంది?

జయ కాటుక కళ్ళు క్షణం చురుకుగా చూశాయి అతన్ని. అప్పటికే అతను టవల్ తీసుకుని బాత్‌రూములో దూరిపోయాడు.

అతనేనేకా ఇలా ఇవతలకు వచ్చాడు. ఎవరో వీధిలోంచి కేక వేశారు. అతను అవతలి వెళ్ళి వచ్చి, "అర్జంటుగా చీఫ్ ఇంజనీరు కబురెట్టాడు" అని యాసగా గుమ్మత్తు చేసి బట్టలు, జోళ్ళు తొడుక్కొని వెళ్ళిపోబోతుంటే చకితురాలై చూస్తూ ఉండి పోయి, తటాలున తెలివి తెచ్చుకుంది జయ.

"అదేమిటి! ఇప్పుడు వెళ్ళిపోతున్నారా? మరి సినిమాకో?" అంది.

"రేపు!" అని బుగ్గ మీద చిటికేసి నడవబోయాడు.

"మీకూ ఏదో పని ఉన్నట్టు వ్రాసి ఆ మనిషితో పంపించకూడదూ?" ఎంత చేతగాని వాళ్ళు అన్నట్టు చూసిందిగాని అదంతా అక్కర్లేనట్టే ముందుకు సాగాడు రమణ.

వెళ్తూ "అలాంటి అభ్యంతరాలు భవిష్యత్తుని పాడు చేస్తాయి" అని అతనన్న మాట చాలాసేపు గదిలోనే ఉండిపోయింది గాలితో కలిసిపోకుండా. ఆ మాటలు ఎందుకో ఉన్నతోద్యోగుల వెక్కిరింపుల్లాగే అనిపించి జయ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

స్వీట్ సిల్కు చీర మెర్క్యురీ లైట్లో మెరుస్తున్నా అదీ వెక్కిరింపులాగే తోచింది. తలలో మెత్తగా ఒళ్ళు విరుచుకుని విచ్చుకుంటున్న మల్లెల పరిమళాల చిరునవ్వులు సైతం ప్రతికూలించిన కాలాన్ని అనుసరించి వెక్కిరింపులయ్యాయి.

ఆ తర్వాత పదిగంటలకు గాబోలు రమణ వచ్చాడు. నిద్రకళ్ళతో అతనికి భోజనం పెట్టించి నిర్లిప్తంగా అటు తిరిగి పడుకుంది. లాభం లేదనుకొని బ్రతిమాలే ప్రయత్నం చెయ్యలేదు రమణ.

*  *  *

ఒక ట్రెయినింగు స్కూలుకు వెళ్ళవలసి ఉండి తెల్లవారి చాలా ముందుగా లేచాడు రమణ. జయ ఇంకా లేవలేదు. ఆమె కళ్ళు విప్పేటప్పటికి అతడు కాఫీ చేసి ఫ్లాస్కులో పోసి ప్రెస్సవుతున్నాడు.

నిశ్శబ్దంగా లేచి మొహం కడుక్కుని వచ్చింది. స్వచ్ఛంగా ఉన్న మొహంలో మచ్చలా అలక ఉండటం చూచి అన్నాడే కాఫీ కోసం టేబిల్ ముందు కూచుంటూ:

"అలిగావా?"

ముందే ఎన్నో సమాధానాలు ముత్యాల సరాల్లా పేర్చుకుని ఉన్న జయ తక్కువ జవాబు లిచ్చింది.

"మీచేతకాని తనానికి నవ్వాలో ఏడవాలో తెలీక అలిగాను." అంది.

"నాది చేతగాని తనమెందు కౌతుంది?"

"కాకుంటే అధికారులో, గొప్పవాళ్ళో పిలిపించినంతమాత్రానికి అఘమేఘాల మీద పరిగెత్తాల్సేముంది?"

"నిన్న చెప్పానుగా!" అన్నాడు కొంచం విసుగ్గా.

"అవును. చెప్పారు" నొక్కి అన్నది కాఫీతో ఉన్న కప్పును విసురుగా అతని ముందుకు తోస్తూ. నున్నని టేబిలేమో విసురుగా వెళ్ళిన కప్పు టేబిల్ అంచు మీదనుంచి దాటిపోవలసిందే అతను వెంటనే పట్టుకోక పోతే. కప్పు ఐతే విరగలేదన్న మాటేగానీ కాఫీ అంతా రమణ మీదే పడింది. కొత్త పాంటు అదోజాకి తగలబడింది.

వెంట మీద ఒక్కటిచ్చామని పించిసంత కోపంతో లేచాడు.

"ఇవాళ సరిగ్గా కట్టుకున్న చీర, మల్లెపూలు సరిగ్గా నప్పిందో లేదో అన్నంత పిరికి తనం నీది." అంటూ బట్టలు మార్చుకో దానికి విసురుగా వెళ్ళాడు.

ఇలాటి పరిస్థితిని వూహించని జయ భయపడింది మొదట. బాధ పడుతూ మరో కప్పుతో కాఫీ అందివ్వబోయింది అతను ఇవతలకు రాగానే.

"అక్కర్లేదు" అంటూ కసురుకున్నాడు రమణ.




'అనుకున్నది అనుకున్నట్టు జరగకపోతే ఆడ వాళ్ళెంత బాధపడతారో మీకు తెలీదు" అంది జయ.

"అవసరాల్ని తెలుసుకోని పెళ్ళాం ఎందుకు దెండుప్పాటులా పెక్కడానికి తప్ప."

"అందుకే నేనిక్కడ ఉండలేను" అంది. అలా అన్న వెంటనే అనుకోకుండా అతన్ని చూస్తూ.

మొహం చిట్లించి చూసి, ఏమీ అన కుండా వెళ్ళిపోయాడు గబగబ.

'ఏమిటా చూపు అర్థం' ఆలోచిస్తూ కూర్చుండిపోయింది. అతని భావమేమిటో ఎంతకూ అర్థం కాలేదు. ఉండమన్నట్టో? పొమ్మన్నట్టో?

ఛీ ఏం చూసి తనీ యింట్లో ఉండగలుగుతూందో? తన కలలూ, నిజాల ప్రాసులో నిజాలు పైకి తేలిపోతుండటం స్పష్టంగా కనిపిస్తుంది.

తనమకున్నట్టు అతను కట్నం తీసుకోని వాడూకాడు. పోనీ బాగా తీసుకున్న వాడూ కాడు. రెండువస్ర వేలకు ఒప్పుకున్నాడు.

ఉద్యోగం విషయం చూడగా ఓవర్సీరు. అది విన్నప్పుడే తన మనసు చెప్పలేనంత బాధ పడింది. పోనీ అని ఎందుకో ఊరుకుంది గాని.. అతని అందం విషయం మరీ బాధించింది. సినిమా హీరోల పోలికలు బొత్తిగా లేవు అతనిలో. ప్రత్యేకంగా ఉంటాడు.

తన కోసం అతను చూపించే శ్రద్ధ ఏమీలేదు. కోపమూ, కారణాలు దొరికినప్పుడంతా విసుక్కోడమూ ఏమంత తక్కువ కాదు. ఇక తన అందాన్ని గుర్తించే తెలివి ఎక్కడ? ఎప్పుడో పెళ్ళయిన కొత్తలో తెచ్చినవి తప్ప, తన ఒంటికి సరిగ్గా అతికే, తళతళ్తుకు గర్వంగా తిరగవచ్చనిపించే చీరలు ఎప్పుడు తెచ్చారు? ఇప్పుడీ మధ్య బొత్తిగా పొదుపుకి మించని, ఖరీదుకి తగ్గని చీరలు తెస్తుంటే "నీకు పొదుపు మీదగ్గరే చూస్తున్నాను.. మరో రెండునాడు, పార్టీల్లో ప్రెజెంటేషన్ వచ్చేదిగా! ఇవి కట్టుకుంటే ఇట్టే నలిగిపోతాయి." అంది.

"దేశ పరిస్థితులలో ఈమాత్రమన్నా చేద్దాం" అన్నాడు నవ్వుతూ.

పోని అన్నమాసం అవతల ఆఫీసర్ల మధ్య ఉండే మనిషి తనేమన్నా కొనుక్కుంటాడా? బట్టలైతే బాగానే కొనుక్కుంటాడు కాని ఆకర్షణీయమైనవీ, ఖరీదైనవీ తక్కువ.

ఒకరోజా.. అట్టే తనను.. ఎంత కోపంగా













తప్పకుండా **సారిడన్** 'రోష్'
**వాడండి**

నొప్పిని పోగొట్టును. సేదదీర్చును, నవోత్సాహమును కలిగించును.

నొప్పికి ఉపశమనకారిగా ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన సారిడన్ నొప్పులనుండి త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా ఉపశమనం కలిగిస్తుంది. తలనొప్పి పంటినొప్పి, ఒళ్లనొప్పులు, మామూలు అస్వస్థతలు మొదలైనవాటి నివారణకు ఎల్లప్పుడూ సారిడన్ వాడండి. పెద్దవారికి ఒక బిళ్ల; పిల్లలకు $\frac{1}{4}$ నుంచి $\frac{1}{2}$ బిళ్లవరకు వెయ్యవచ్చును.

JWT VT-3339 (R).




(ఒకే ఒక సారిడన్ బిళ్ల చాలును)

**'రోష్' తయారు**

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్లాస్ లిమిటెడ్

పోతాడు? పరిసరాల్లో ఉండనిచ్చాడా? అనుకుంటున్నది ఇంకా ఏమో ఒరుగు తుందని. రమ్యహర్మ్యాలు నిర్మించుకుం టుంది అలా అని. కాని ఇది నరకం.. ఈనాడు ధృవపడింది. మునమ్మాటికీ ఇది నరకం. ఏమైనాగాని తనిక్కడ ఒక్క క్షణం ఉండదు.

రమణ వచ్చేటప్పటికి ఇంటికి తాళం వేసి ఉంది. అతననుకుంటున్నాడు. రెండు మూడు నెలలుగా జయ ప్రవృత్తిలో ఆవేశం కనిపిస్తుంది. ఎప్పుడో ఒకనాడు ఇలా జరగవచ్చుని ఊహిస్తున్నాడు.

పొరుగింటి వాళ్ళ నడిగి తాళం తీసు కున్నాడు. వెంటనే ఏం చెయ్యాలో తోచ లేదు. తర్వాత ఓ ఉపాయంతోచి, పోస్టా ఫీసుకు వెళ్లి మామగారి ఊరికి వైరిచ్చాడు జయ అక్కడకు వస్తున్నట్టు "ఫర్వాలేదు ఆమెకన్నా ముందుగానే చేరుతుందది. చేరక పోయినా అంత ఫరవాలేదు." అనుకుంటూ నేరుగా హోటల్‌కు వెళ్ళిపోయాడు.

స్టేషన్‌కు వచ్చిన తమ్ముళ్ళ్ని చూచి ఆశ్చర్యపడిన జయ అప్రయత్నంగా నోరు తెరిచి కూడా, ఏమీ అడగలేకపోయింది అప్పటికి.

ఇంట్లో కనిపించిన దొడ్డమ్మ కూడా జయకు శుభసూచకంలా కనిపించలేదు.

ఆవిడ జయను చూస్తూనే "ఈనాటి పిల్లలు అలా పెరిగ్రాం కొట్టడం, అలా రైలో విమానమో ఎక్కడం, ఇలా వాలిపోవడమూను." అంది.

ఎలాగో నవ్వు తెచ్చుకుని "ఎప్పుడొచ్చావు దొడ్డమ్మా?" అని అడిగేసింది జయ. తనెలా వచ్చిందో వర్ణించడంలో దొడ్డమ్మకు జయ విషయాలు లాగడాని కవకాశం లేకుండా పోయింది..

అమ్మ మాత్రం దిష్టితీసి 'లోపలికి తీసుకెళ్ళింది.

జయ మునుపట్లాగ బహుమతులేవీ తీసుకు రానందుకు చెల్లెళ్ళందరూ మూతులు ముడుచుకుని కూచున్నారు. దాంట్లో గుర్తొచ్చి కొన్న చాక్లెట్లు పెట్టె వనజ చేతిలోపెడితే గోడకేసి విసిరికొట్టింది. "ట్వింకిల్ నైలాన్ జాకెట్టు గుడ్డ తేవడం మరచిపోయావుగాని.." అని దీర్ఘం తీస్తూ.

ఏడాదికే పెద్ద పొడవుగా అయిపోయిన చిట్టితమ్ముడు క్రిందపడ్డ చాక్లెట్లన్నీ ఏరు కున్నాడు.

# కలలు

నెలరోజులు సరదాగా గడిచిపోయాక గాని ఎవరిలో చంచలనం కలగలేదు. ముం దుగా ఆ బాధ దొడ్డమ్మగారిలోనే ఆరంభ మయింది. "ఎన్నాళ్ళకి సెలవు చీటి వ్రాశావే పిల్లా!" అని ఆవిడ అడిగేసరికి ఉలిక్కిపడింది జయ.

గబుక్కున నవ్వు తెచ్చుకుని "జీవితం ఉద్యోగం కాదు దొడ్డమ్మా కట్టుబడి ఉండ టానికి; ఎలిమెంటరీ స్కూలు అది. ఎన్ని సార్లు మానేసినా అడిగే వాళ్ళుండకూడదు" అంది.

ఆవిడ ఏదో గొణుక్కుంటూ వెళ్ళి పోయింది.

"అంటే మీ ఉద్దేశంలో కాలేజీ ఎటు వంటిది? పాఠాలు అర్థంచేసుకోవల్సిన అంత స్థకు చెందినదనే కదూ?" పెద్దతమ్ముడి ఫ్రెండు రామచంద్రం అడిగాడు. అత నక్కడ ఉండటం జయ గమనించలేదేమో, ఆ ప్రశ్నతో బిత్తరపోయింది. నవ్వేసి ఏదో చెప్పింది. కాని కొంతసేపు దాన్ని గురించే ఆలోచించింది. తన ప్రస్తుత పరిస్థితికీ స్కూలుపాఠాలకీ సంబంధం ఏమన్నా ఉందా? అందులోనూ రామచంద్రం సునిశితంగా వినే మనిషి.

కాలంతో పాటు ఆలోచనలు కూడా సాగి పోతూనే ఉన్నాయి.

అమ్మ, దొడ్డమ్మ ఒకరికొకరు మరో ప్రాణం. అమ్మకు దొడ్డమ్మ మాట అన్నిటి కంటె ఎక్కువ.

క్రమక్రమంగా దొడ్డమ్మ మాటలు చంద్రమ్మ చెవికి బాగా ఎక్కాయి. "మీ ఆయనేం ఉత్తరాలు రాస్తున్నట్టు లేదే?" అందావిడ తీరిక చేసుకుని.

ఈ నెల్లాళ్ళూ ఓర్పుతో దొడ్డమ్మ గొణుగుడు విని విని విసుగెత్తిపోయిన జయ రోషం పట్టలేక అరుపులకే ఆరంభించింది ఏకంగా.

"పెమ్మన్న వాళ్ళు ఎందుకు రాస్తారే!" అంది గట్టిగా.

"ఏమిటా అరుపులు? నోరు తగ్గించు. ఇంతకీ.. ఇంకా నయం దొడ్డమ్మ పక్షం రోజుల్నుంచి కొట్టుకుంటున్నా నాకు అనుమానం తగల్లేదు. అతను కోర్టెక్కితే ఎంత పరువు పోయే మాట!" అంది తల్లి.

నిర్వికారంగా నవ్వింది జయ. "ఎక్కి) ఎక్కనీ నేను మాత్రం కోర్టెక్కుతాను."

"దిక్కులేని దానివైపోతావే సిగ్గు లేని దానా!"

"మీరంతా ఉండగా దిక్కులేని దాన్నెలా అవుతాను?"

కీయిచ్చిన బొమ్మలా, అక్కడి దాకా వచ్చే సిన దొడ్డమ్మగారు, 'కీ' అయిపోయినట్టు టక్కున ఆగిపోయింది బుగ్గలు నొక్కు కుంటూ..

అసలు గొడవంతా ఆరోజు డైనింగు టేబిల్ దగ్గరే జరిగింది.

మొగుడుతో ఎలా చెప్పాలో తెలికగాబోలు చంద్రమ్మ నేరుగా కూతురుతోనే వాదం ప్రారంభించింది.

"మగవాడికి ఏమన్నా చెల్లుతుంది. ఆడ దానివి—అతగాడు రేపొద్దున్న అక్కర్లేదు పొమ్మంటే కానికి చెల్లుతావే? పైగా పెద్ద చదువులు చదివిందట. అందుకే వద్దు మొర్రో అన్నాను. ఈయన వింటేనా?"

సుందర్రావు తెల్లబోయచూడు. ఏమీ అనకుండా వినసాగాడు.

జయ కోపంగా తలెత్తి "నీకెలా తెలు స్తుంది నా బాధ! బిడ్డతల్లి బాధ గొడ్రాలికి తెలినట్టే, గొడ్రాలి బాధ బిడ్డ తల్లికి తెలిదు మరి!" అంది.

"చూశారా! ఎలా ఎదిరిస్తోందో, వినండి" చంద్రమ్మ విసురుకు నవ్వుగిన్నె టేబిల్ మీదకు జారి దొర్లి నేలను కరుచు కుంది.

"మాట్లాడితే ఎదిరింపంటావు?" అంది జయ మొహం ముడుచుకుని.

దొడ్డమ్మ అంది: "మరిదీ! నీకు తెలీదు. ఆడపిల్లలు పిచ్చిపిల్లలు. మన జయ లాంటి అమ్మాయిల గురించి వేరే చెప్పేదే ముంది బాబూ! ఏదో ఆడపిల్లను కన్నాక తలొంచుకుని తప్పులు దిద్దుకోవలిసిందే. వాళ్ళ తప్పులు మనవే అనుకోవాలి."

పెద్ద తమ్ముడికి పౌరుషం వచ్చినట్టుంది "నాన్సెన్స్! వాళ్ళ తప్పులు మనవెలా అవు తాయి దొడ్డమ్మా!" అన్నాడు.

"నువ్వూరుకోరా! చూడు మరిదీ! అయిం దేదో అయింది. రేపు పెందరాళే మెయిలుకో, జనతాకో అమ్మాయితో వెళ్ళిపో. చేతులు పట్టుకుని అప్పగించి వచ్చెయ్యి."

"ఆయన ఉత్తరం వ్రాయకుండా వెళ్ళటానికి నాకేం సిగ్గు లేదనుకున్నావా? ఎడం కాలో తన్ని తలుపేసుకుంటే ఆ అవ మానం ఎవరి పోతుందేమిటి?" దొడ్డమ్మ

వైపు తీక్షణంగా చూస్తూ అడిగారు జయ.

కాని ఆవిడ తొణకలేదు. "దాపుడి లప్పు దండంతో సరి అన్నారు పెద్దలు. ఒకవేళ అతడు తన్నినా, ఆ కాలునే పట్టుకుంటే పోలే?"

"ఆ..ఆ.. పూర్వకాలం మాటలు చెప్పకు దొడ్డమ్మా!"

"చూశావే!" తెల్లబోయిన దొడ్డమ్మ చెల్లెలి మొహం చూడబోయింది. కాని అప్పటికే చంద్రమ్మ తన అక్కగారిని చూస్తూ నిలబడి ఉన్నది.

ఎంతోసేపు నిశ్శబ్దం రాజ్యమేలలేదు.

"అందుకే అన్నారా—" అని దీర్ఘం తీశాడు పెద్ద తమ్ముడు.

"ఎవరు?" అంది అప్రయత్నంగా జయ.

"మన పూర్వులు."

"ఓహో!"

"ఆడ వాళ్ళకు స్వతంత్రం ఇవ్వకూడదు. పొరపాటునైనా చదివించకూడదు. ఎనిమిదేళ్ళకే పెళ్ళి చేసెయ్యాలి. పదిహేను నిండకముందే అత్తారింటికి సాగనంపాలి. పిల్లల్ని కనమనాలి. వంట అనే ప్రమోషన్ లేని ఉద్యోగంలో వేయ్యాలి. సాధ్యమైతే అణగ ద్రొక్కాలి!"

"ఒరేయ్ వెధవా! నోరుముయ్యరాముందు"

కంచం తననిగాదకు విసిరేస్తుందేమోనని సందేహించింది తమ్ముడికి. అప్పుడప్పుడు అతనికి జయ సింగాడిలా కనిపించి కిక్కురుమనడు. ఇప్పుడూ అదే జరిగింది.

సుందర్రావుగారు మృదువుగా "ఏమమ్మా! అసలు మీ ఇద్దరి మధ్య ఏం జరిగింది? మాటా మాటా అనుకున్నారా?" అనడిగాడు.

"లేదునాన్నగారూ! ఆయన నాకు ఉత్తరం వ్రాయందే వెళ్ళలేను." అంటూ ఒకసారి కళ్ళు సున్నితంగా ఒత్తుకుని వెళ్ళిపోయింది.

భోజనం ముగించి సుందర్రావు ఆలోచిస్తూ లోపలికి వెళ్ళాడు. ఇంకా దొడ్డమ్మ చంద్రమ్మ ఆవిషయమై తల్లక్రిందులౌతూనే ఉన్నారు.

నాలుగురోజుల తర్వాత ఒక ఉత్తరం వచ్చింది సుందర్రావుగారికి. 'మీఅమ్మాయిని త్వరలో పంపగలరని ఆశిస్తాను.'

ఆఉత్తరాన్ని బాగా పరికించింది జయ. 'నాన్నగారు ఏమైనా ప్రయత్నించేశారేమిటి?' అనుకుంది. అయితే తనువచ్చేసినందుకు రమణకి కోపం రాలేదా?'

'హు—ఇప్పుడు తనవిలువ తెలిసి ఉంటుంది— మళ్ళీ తను వెళ్తే యధాప్రకారం తిరుగుతుంది మనసు, మళ్ళీ ఆజీవితం మొదలు'.

తనకొక ఉత్తరం వచ్చేదాకా వెళ్ళకూడదని నిశ్చయించుకుంది జయ.

ఆనిశ్చయం విని ఈసారి సుందర్రావు ఆశ్చర్య పోయాడు. కూతురుకంత దెబ్బ కలిగించిన కారణం ఏమిటా అని ఆయన ఊరుకున్నాడు ఆడవాళ్ళు మొత్తుకుంటున్నా.

మర్నాడే మరో ఉత్తరం వచ్చింది జయ పేరున. అతని దస్తూరి కనిపెట్టి ఆశ్చర్యంగా చూసుకుంది విప్పి.

"ఎప్పుడొస్తావా అని ఎదురుచూస్తున్నాను.' ఆముక్కనే పరీక్షగా చూసింది పదేపదే.

'ఎదురు చూస్తున్నారట'! ఎదురు!' చాలామంది ఆడవాళ్ళలాగే మనస్సులో తింపకాయలు వాయించేసింది భర్త గారికి.

తనలో మళ్ళీ ప్రేమభావం పొంగటం గమనించి మందలించుకుంది.

ఈఉత్తరంతో ఇంట్లో వారందరూ మరింత రెచ్చిపోయారు.

ఆరోజే ప్రయాణం కమ్మంది దొడ్డమ్మ. చాటుగా పిలిచి 'ఈసారెప్పుడూ ఇలాటి పిచ్చిపనులు చెయ్యకు—'అని చెప్పింది తల్లి. అక్కయ్య వెళ్ళిపోతుంది. ఇక హాయిగా ఉండొచ్చు అని తమ్ముడు ఏడిపించాడు. సుందర్రావు పిలిచి అడిగాడు: "ఎప్పుడు వెళ్తావమ్మా?"

"శనివారం—పదిగంటలకోబండి ఉంటాలి నాన్నగారూ?" అంది అక్కడ ఉండలేక వెళ్ళిపోతూ.

"అబ్బ—సరిగా అయిదు రోజాలుంది ఇంకా," అంటున్నాడు చిట్టితమ్ముడు.

"ఛీ! ఛీ! —"అనుకుంది. "ఎంతభారమైపోయాను వీళ్ళకి—"

ఆవారం మరీ ఇబ్బందిగా తయారైంది జయకా యింట్లో. అందరూ రమణను మెచ్చుకునేవాళ్ళే. తనను నిరసించేవాళ్ళు ఉండనే ఉన్నారు.

రేపు ప్రయాణమనగా, రాత్రి పడుకునే ముందు దొడ్డమ్మ తన గదిలోకి రాబోయింది.

"దొడ్డమ్మా ! నీపాదాలు పట్టుకుంటాను—ఈ రాత్రి నాకు మరేమీ చెప్పకు." ప్రాధేయపడుతున్నట్టు అడిగింది.

అమ్మ పిలవగానే దొడ్డమ్మ గొణుక్కుంటూ వెళ్ళిపోయింది. జయ తలుపు బిగించుకుని గట్టిగా ఊపిరి తీసుకుంది.

తన కలలన్నీ ఒక్కొక్కటే గుర్తువచ్చి కంటతెట్టాయి. రమణతో జరిగిన ఒక్కొక్క అవమానపు సంఘటన భూతద్దంలో కనిపించను మొదలెట్టాయి. మళ్ళీ అతనితో ఆ భయంకరమైన జీవితంలోకి వెళ్ళిపోవాలి. ఇక్కడమరీ అన్యాయమైపోయింది. ఇక్కడి సాధింపుల్లో మెలగడంకన్న అక్కడి బానిస బ్రతుకే మేరు గనిపిస్తుంది.

అందరి విషయంలో జీవితం మామూలు



కత్తి కాదన్ను. కాని రెండు వైపులా పదునుగా ఉన్న ఈ కత్తిమీద నడవలేక తను చచ్చిపోతున్నది.

ఇకనుంచీ మామూలు కత్తిమీదసాము మొదలు కాబోతున్నదని తలుచుకోగానే ఒళ్ళంతా చెమటలతో, వేడి ఊపిరితో ఉక్కిరిబిక్కిరైపోయిన మనసుతో నిద్ర పట్టలేదు జయకి.

గోడనున్న వాచీ ఒకసారి మందలించినాకగాని— కళ్ళు బలవంతంగా మూసుకునే ప్రయత్నం చెయ్యలేదు ఆవిడ.

* * *

పది గంటలకు బయల్దేరిన బండి మధ్యాహ్నం రెండున్నరకుగాబోలు — చేరింది. స్టేషన్‌లో చూసింది. ఆకోసనుంచి అతను ఒక్కో పెట్టె చూసుకుంటూ వస్తున్నాడు. హేళనగా నవ్వుతాడేమో ననుకుంది. నవ్వలేదు.

సూట్‌కేసు అందుకున్నాడు. కూలీ వచ్చి పెట్టె దించాడు. టాక్సీలో కూర్చున్న తర్వాత పొట్లం విప్పి ద్రాక్షపళ్ళిచ్చాడు. మౌనంగా పుచ్చుకుంది.

ఇంటికి చేరుకున్నాక "నాలుగున్నరకి వస్తాను." అంటూ వెళ్ళిపోయాడు.

ఒక్కసారి 'అమ్మయ్య' అని మెత్తని పరుపు మీద వాలి పోయింది జయ. ఎంత నిర్దయగా ప్రవర్తిస్తాడో, అనుకుంది. ఎంతైనా పదిమందిమధ్య చివాట్లకన్న, ఒక్కడి దగ్గర తిట్లు ఎంత నయం ? ఇక్కడ తనను వెక్కిరించడానికి మరెవరూ లేరు . తనమీద భారమంతా వేసి ఇంకెవరు వెళ్ళగలరు?

మత్తులోంచి మెలకువ వచ్చే సరికి సరిగ్గా నాలుగైంది. రమణ ఇంకా రాలేదు. బరువుగా రెప్పలు త్రిప్పి చుట్టూ చూస్తూ ఒక్కసారిగా దిగ్భ్రమించి పోయింది జయ.

సోఫాసెట్టు, చాలా అందమైనది—ఖరీదైనదిలా కూడా ఉంది—అక్కడికెలావచ్చిందో కొన్ని క్షణాలు అర్థం కాలేదు. ఎప్పుడు కొన్నారు అన్న ఆలోచనే బొమ్మలా నిలబెట్టేసింది. దగ్గరకువెళ్ళి చేత్తో స్పృశిస్తేకాని తృప్తి కలగలేదు. ఇందాక బడలికలోను, భయాల్లోను ఇవి తన కళ్ళకి అసలు కనిపించనే కనిపించనందుకు నవ్వొచ్చింది.

రమణ వస్తే ఏమని పొగడాలి? ఆయున్ని

తను సాగిడేదేమిటి? అని ఆలోచించు కుంటూ టీ తయారు చేసింది. హాల్లో అతను వచ్చిన చప్పుడైంది. బూట్లు విప్పుకుని లోపలికి వచ్చాడు. తన ప్రక్కన నిశ్శబ్దంగా నిలబడిన అతనివైపు తిరగ కుండానే "సోఫాసెట్టెప్పుడుకొన్నారు?" అనడిగింది టీ కప్పుల్లో పోస్తూ.

"నెలవుతుంది"

'ఏమిటీమౌనం?" అనుకొంది.

'టీ'లు అవగానే అతను జేబులోంచి ఏదో ఆకు పొట్లాంతీసి ఆమెకి అందించాడు. విప్పకపోయినా అవి పువ్వులని జయకు తెలుసు.

"ఎందుకు?" అంది కళ్ళతో

"సినిమాకి వెళ్దాం" అన్నాడు తనూ అలాగే చూస్తూ.

జయఅలాచూస్తూనే ఫక్కున నవ్వేసింది. రమణకూడా నవ్వి "అందుకేనానువ్వెళ్ళిపోవ డం?" అన్నాడు.

జయ నవ్వు కట్టుబడిపోయింది. "ఇవాళ వద్దు. నాకు అలసటగా ఉంది."

"అలసట పోవడానికే వెళ్ళాలి."

"ఉహూ."

"పోనీ, పువ్వులు పెట్టుకుంటావా?"

"ఎందుకు పెట్టుకోను?" ఇతనికన్నా శిక్ష బాగానే అయింది అని నవ్వుకుని పువ్వులు జడలో పెట్టుకుంది.

ఆరాత్రి రమణ "నిజం చెప్పమంటావా?" అని అడిగాడు.

"స్కూటర్ కొంటానని బాంకునుండి తీసిన డబ్బే వీటికి పెట్టేశాను."

"ఏం?"

"స్కూటర్ అంటే నాకిష్టంలేదు. కొంటే సైకిలు, లేదా కారు. ఒకవేళ స్కూటరు కొంటాననుకో, నువ్వూ ఎక్కుతానంటావు"

"తప్పేం—? ఈరోజుల్లో మొగుడూ పెళ్ళాలు స్కూటరుమీద ఎక్కడం వింతా ఏమిటి?"

"కాదులే. కాని ఒకరోజుచూసిన దృశ్యం తోనాకు స్కూటరంటే విరక్తివేసింది. భార్యా భర్త ఇద్దరూ స్కూటర్ మీద సరదాగా బయల్దేరుతున్నారు. ఎవరో తెల్సుకుందామని అటు చూశాను. అంతా ఒక సెకను అనుకో. నేను కళ్ళప్పగింతగా అటు తిప్పిందే ఆవిడ స్కూటర్ మీద నుంచి క్రింద పడిపోయింది. అందరూ గుమి గూడారు. తర్వాత హాస్పిటల్కు తీసుకు వెళ్ళారు. ఏదో బతికి బయట పడిందిలే. వెన్ను వంకరైందట. అయినా ఆసంఘ టన నేను తేలిగ్గా మరిచి పోలేదు. అలా నీకే జరిగితే నేనేమై పోవాలి?"

"నిజంగానా?"

"నిజంకాక?" ఆశ్చర్యపోతూఅన్నాడు.

సీరియస్గా అడుగు తున్న జయ మాట కొద్దిగా తప్పించింది.

"వంటచేసి పెట్టడానికి ఉండరని భయం."

రమణ ముఖ కవళికలు మారాయి.

"వంటకోసమే అయితే మగవాడినైనా సిగ్గువిడిచి నిన్నే ఇప్పటికిప్పుడు రప్పించు కునే అవసరమేమిటి? ఇదివరకు మా అమ్మ వండిపెట్టలేదా? ఇప్పుడూ వండి పెడు తుంది. ఒకవేళ ఈవయస్సులో అమ్మతో ఉండటం కష్టమైతే, అందమందాలుండి అయిదో తనం లేని నాన్నంత మరదల్ని తెచ్చుకుందును. అందులో నాకు సితి బాధలు పట్టింపులు కూడా లేవు. ఒక రికి అన్యాయం చెయ్యాలని అనిపించదు. ఆ అమ్మాయి పాపం అనాథురాలు. నేనంటే అయిష్టంతో వెళ్ళి పోయావు కనుక అదినీకు శిక్ష అయితే అనాథగాని అన్యా యం అనదు..."

ఇలా చెప్పుకు పోతున్న అతనిమాటని ఆపాలనే ప్రయత్నంలో మాటలకోసం వెతుక్కుని "అంటే మీకు నామీద అంత ప్రేమన్నమాట! నీనికే నానీ, నీతోడేనా బ్రాని అని గేయం ఉంది." అంది నవ్వును పెదాల్లో బిగిస్తూ.

రమణ పక్కున లేచి పోయాడు. తర్వాత అతనికోపం తీర్చడంకోసం "సెకండ్ షోకి వెళ్దామా?" అనడిగింది జయ.

"నువ్వు వెళ్ళు!" కసిగా అన్నాడు అప్పటికే ఉద్రేకాన్ని చాలావరకు తగ్గించు కున్న రమణ. జయ నవ్వి ఊరుకుంది.

మర్నాడు ప్రశాంతమైన నటనతో బాగా సొప్పించ గలిగింది జయ. కాని మనస్సులో మహా సముద్రం తన ఘోషమానదు.

ఇప్పుడు తన ఉద్రేకాలు ఈవాతావరణా నికి ప్రతికూలంగా లేవు. అది వింతగా ఉంది మనస్సుకి. ఇంట్లో జరిగిన అల జడికి బెదిరిపోయి ఈపరిసరాలకి తను సమాధాన పడుతున్నట్టుంది.

మధ్యాహ్నం రమణ ఎక్కడికీవెళ్ళలేదు. జయ అదమరచి పడుకున్నదంతా ఏదో కలవచ్చి ఉలిక్కిపడి కళ్ళువిప్పింది. కళ్ళు తెరచి మరింత ఉలిక్కిపడింది. మీదకు వంగిఉన మొహాన్నే చూస్తున్నాడు రమణ తదేకంగా.

"ఇదేమిటి?" అంది లేచికూచుంటూ.

"నీకల ఇంకా పూర్తి కాలేదు? 'హాతా న్రా పోతాను! నాపీడ వదిలి పోతుం' మీకూ అని అరచావు—ఆతర్వాత?" కుతూ హలంగా చూస్తున్న అతని చూపుల్ని తప్పించుకుంటూ "నాకలలు మీకెందుకు చెప్పాలి. అయినా నాకలవరింతలు విన మని మీకెవరు చెప్పారు?—ఇన్నాళ్ళూ మీరు మంచివాళ్ళను కున్నాను. ప్రతిమనిషి లోను చెడ్డగుణాలు తప్పవుకాబోలు." అంది.

రమణ నవ్వి "నేనుమంచివాణ్ణయితేమళ్ళీ పుట్టింటికెందుకు పరిగెత్తుతావ్? అక్కడ బాగా సన్మానం జరిగిందన్నమాట! మంచి పనయిందిలే, లేకపోతే ఆసొగదేమిటి?" అన్నాడు.

"నాకేం జరగలేదు.—" అంది జయ నేలే ఆలోచనతో. రమణ నవ్వుకుంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఇందాక వచ్చిన కలజ్ఞాపకం వస్తు కుంటున్నది. ఆకలనుంచి తప్పరిల్లాక ఎంతో హాయనిపించింది. వివాహానికి ముందువచ్చిన మధుర మైన కలలవుండు నిజమైన జీవితం వెల్లబారి పోయినట్టు కనిపించింది. పుట్టింటికి వెళ్ళిన తర్వాత ఇక్కడి జీవితాన్ని వూహించుకుంటే మరింత భయంతో ఒళ్ళు గగుర్పొడిచింది. తిరిగి రాక తప్పలేదు. కాని మొన్నటి భయం కరమైన వూహాల నీడకైనా ఇక్కడెక్కడా లేకపోవడం ఆశ్చర్యమే. నిజంగా చూసినా కలలు కళ్ళలేవనిపిస్తున్నాయి. కాని కొన్ని కలల్లో మధురిమ లేదంటే ఎవరొప్పుకుం టారు.

కాఫీల తర్వాత సాయంత్రం రమణ ఒక్కడూ షికారు వెళ్ళిపోయాడు.

తను లేకపోవడం వల్ల రమణగది చండాలంగా తయారైంది. బల్లమీద పుస్తకాలు సర్దుతూ ఉత్తరాల ఫైలు తెరిచింది. జారిపడిన నీలికవరు తీసి ఎవరు వ్రాశారా అని పరిశీలనగా చూసింది సంత కాన్ని. మల్లిక అని ఉంది చివర. మల్లిక రమణకి దొడ్డమ్మ కూతురు. పొట్టిగాభావాలు. తెల్లని తెలుపుతో మిడిసి పడే మల్లిక

అభిమానాభిమానాలకి కూడా మరికొంత అందమైనవిగా ఉంటాయి. అలాంటి మల్లిక చూడడానికి పల్లెటూరి పిల్లలా కనిపిస్తుంది. ఎమ్మెస్సీ చదివి ట్యుటోరియల్ కాలేజిలో పని చేస్తున్నది. కొన్నాళ్ళ పెళ్ళి చేసుకోనంది. తర్వాత ఏమందో తనకు తెలీదు. కాని రమణ ఇన్ని ఉత్తరాలు తను చదవనివి ఉన్నాయని చెప్పనందుకు కోపం వచ్చి. అన్నీ వరసన పెట్టి చదివెయ్యడానికి కుర్చీలో మఠం వేసుక్కూర్చుంది విజయ.

ప్రియమైన రమణ అన్నా!

నిన్నుచూచి చాలా రోజులైంది. నాపెళ్ళికి అయితే తప్ప ఇక్కడికి ఇప్పట్లోరావని నాకు తెలుసు.అందుకేపెళ్ళిచేసుకుంటున్నాను

ఇలాసాగింది మల్లిక ఉత్తరం. ఏదో అసంతృప్తి ఆ వుత్తరం పొడవునా ఉంది కాని మునివిత చమత్కారంతో వ్రాసింది.

'పెళ్ళి చేసుకుంటున్నానే కాని నాకంత సంతృప్తి లేదన్నయ్యా' అంది ఒకచోట.

అక్కడే ఆగిపోయి రెండుమూడుసార్లు చదువుకుంది జయ.

'పిల్ల తరుపువాళ్ళ అయినాసరే వేలు ఇచ్చుకోవడానికేమీ జంకడంలేదన్నా నువ్వు ససేమిరా అన్నావట కదూ? మొన్న మాటల్లో పిన్ని చెప్పింది. మరి కట్నం తీసుకున్నందుకు నేను వెక్కిరిస్తుంటే ఎందుకు ఊరుకున్నావో నాకర్థం కావటం లేదు. లాంఛనానికే తీసుకుంటున్నట్టు ఎదురు చెప్పలేక పోయావా? నిజంగా నువ్వను కున్నట్టు పదివేలకీ రెండువేలకీ ఎంతో అంతరం ఉంది. ఈమధ్య తెర వెనుక పుచ్చుకునే ఘనుల్ని చూశాక మరింత అసహ్యం వేసింది.

ఇలాటి గొడవలన్నీ చూసి పెళ్ళిచేసుకోనన్నాను. మొదట్లో నాన్నగారు నవ్వి ఊరుకునేవారు. ఈమధ్య ఏమైందోగానీ— తనఇద్దరాడపిల్లలకూ ఒకేసారి పెళ్ళిచేసి సర్వీసులో ఉండగానే బరువుతీర్చుకుంటూ పని తిరుగు లేనట్టు మాట్లాడు తున్నారు. ప్రతి మనిషిలోను సత్వ రజస్తమో గుణాల్లాగే పిచ్చి గుణం కూడా కొద్దిగా చోటు చేసుకుంటుందేమో! ఒక్కొక్కసారి అది ఒకే ఇదిగా చెలరేగుతుంది.'

'ఇలా ఉంది ఇక్కడి పరిస్థితి. నామనః స్థితి వర్ణనాతీతం. నిన్ను ప్రేమించినట్టు నాదగ్గర ఒప్పుకున్న నిర్మల, నేనిప్పుడు పెళ్ళిచేసుకోబోతున్న వార్తవిని ఈ మధ్య ప్రత్యేకంగా కలుసుకుని మరీ ఎగతాళి చేసింది."

## కలలు

జయ బంధాలువేసినట్టు ఆగిపోయిందక్కడ. శరీరంలో ఎక్కడో సొమ్మసిల్లి పడివున్న అనుమానసర్పం ఆకలితోబుసలు కొడుతూ లేచింది. అప్రయత్నంగానే ఆఉత్తరం అక్కడ పడేసి మంచంమీదకు వాలి కొద్దిసేపు దొర్లింది. దేనికీకాలహరణం చేసే స్వభావంకాదు జయది. ఆరోజే అడిగింది రమణను.

"మీరు ఎవరో అమ్మాయిని ప్రేమించారట కదూ?" సూటిగా అతన్ని చూస్తూ అంది.

ఆశ్చర్యపడుతూ "నేనా?...ఓహో ఉత్తరంచూశావేమిటి ?" అన్నాడు. "నేను ప్రేమించలేదు.ఆఅమ్మాయేనన్ను ప్రేమించిందట. బహుశా సినిమాలు ఎక్కువ చూడటంవల్ల ఏదో భ్రమపట్టుకుని ఉంటుంది. ఈసంగతి నాకు తెలియడానికి ఆవిడగారికి మల్లిక స్నేహితురాలుగా దొరికింది."

"మరి అత్తయ్యావాళ్ళు ఒప్పుకోలేదా?" అన్నది జయ.

"వాళ్ళకన్న ముందుగా నేనే ఒప్పుకోలేదు. పోనీ ఆపిల్ల వైపునుంచి ఆలోచిద్దామన్నా కులమనేపెద్ద కందకం మొదటే వుంది మా ఇద్దరి మధ్య. ఆపైన అంతస్తుఅనే గేటు లోపించిన గోడ ఉండనే ఉంది మావాళ్ళకి., మరోజన్మలో పెళ్ళాడదాం అని కబురంపాను"

"దీన్ని గురించి అయితే బాగా చర్చలు జరిగాయన్నమాట!"

"ఊహూ! మాముగ్గురి మధ్యే ఉంది ఈ రహస్యం !"

"తర్వాత మీరు ఆఅమ్మాయిని ప్రేమించడానికి ప్రయత్నించారు కదూ?"

సూటిగా చూస్తున్న జయకళ్ళల్లోకి అంత సూటిగానూ చూశాడు రమణ. కాగా తీవ్రంగా గుండె కొట్టుకునే బాధ జయకు తప్ప రమణకు లేదు.

"తెలిసి తెలిసి ఉచ్చులో పడేకన్నా తెలీనట్టు ఊరుకోడమే మేలు. తెలివైన వాణ్ణిగాబట్టి నాకా సంగతి ఏనాడో తెలుసు" నవ్వాడు లేస్తూ. . .

"మరోజన్మ గురించి మీకా నమ్మకమేమిటి? ఎన్ని జన్మలెత్తినా భార్యాభర్తలు మారరుగా?"

"మనమంత పతివ్రతలం కాములే!"

ఏదో ఆలోచనలోంచి జయ తేరుకునే సరికి ఎదురుగా రమణ లేడు.

ఎంత అందం లేకపోతే నిర్మల ప్రేమిస్తుంది? ఎంత హృదయ సౌందర్యం లేకపోతే కట్నం గురించి తీవ్రంగా ఆలోచిస్తాడు?

అవును— అందగాడే. అదోవిధమైన వ్యతిరిక్తత. అంతేకాదు—అందమైనమనసు కూడా ఉంది. అది నిజంకాకుంటే కొన్ని పొరపాట్లకు తనను శిక్షించవలసిందే అతను! తను ఒకనాడు కలలు కన్న వ్యక్తికి దూరంగా లేడు రమణ అని ఇవాళ తెలుస్తున్నది...... కాని.....కాని...,

మళ్ళీ నెలరోజుల నాటికి ఒక రాత్రి చిత్రమైన సంచలనం మొదలైంది జయలో.

"అలా చూస్తున్నావేం—మొహానికి గంటు కనిపిస్తోందేమిటి'? అన్నాడు రమణ భోజనాల దగ్గర.

జయ నవ్వుకుంటూ తల వంచుకుంది. "మీరుచాలా బావుంటారు." అంది పులుసు వడ్డించు కుంటూ.

"ఇప్పటికా నన్ను ప్రేమిస్తున్నావ్? నేను రోజూ ప్రేమిస్తున్నాన్నిన్ను!" అన్నాడు పెదవి విరిచి.

అతని నోటితో తనను గురించి మనః పూర్వకమైన మొదటి అభిప్రాయం (వర్ణన లాటిది) ఇది. అందుకే జయకు ఆనందం వంటి దేదో ఆవహించింది.

తనకలలజాబితాలో ఇది ఒకటి!

తనుకోరిన వ్యక్తిత్వం రమణలో ఇంత ఆలస్యంగా కనిపించడానికి కారణం ఒకప్పటి మధుర స్వప్నాలు. ఆలస్యంగానైనా అతని గొప్పతనాన్ని గుర్తించడానికి కారణం మొన్నటి భయంకరమైన కలలు.

ఈ తీవ్రత అతను గమనించకుండా అణిచేస్తోంది జయ.

తర్వాత ఎప్పుడో అతి సన్నిహితంగా ఉన్నక్షణంలో— "ఎందుకో మరింత అందంతో కనిపిస్తున్నావ్ జయా నాకళ్ళకి!"

నామొహానికీ, మీమొహానికీ మధ్య ఇన్నాళ్ళూ ఉన్న నాకలల పరదాల్నిఎవరో ఈ మధ్య తొలగించేసి ఉంటారు అనుకుంది జయ లోపల.

"మీరు చాలా మంచివాళ్ళు"! అని ఒప్పుకుంది మరొక రోజు. ●

* నా చర్మసౌందర్యమునకు లక్స్ దివ్యమైనది *

అన్నది వైజయంతిమాల






వైజయంతిమాలకున్నట్లే
మీకున్న చర్మసౌందర్యం
అమూల్యం... ఆ సాధనమే
దానికి తగినది !

సుందరియైన వైజయంతిమాల ఇలా చెప్పుచున్నది. చర్మసౌందర్యం మీకు, నాకు ఉభయులకు అమూల్యం. ఎందుకంటే, అది వనితను పరిపూర్ణ సౌందర్యంగా వుంచుతుంది. నాసౌందర్యకారియైన సబ్బు...లక్స్‌ను మీరు ఎందుకు వాడి చూడగూడదు ? దాని మీగడవంటి నురగ ఎంతో సౌమ్యమైనది...నాకు ప్రియమైన పరిమళం గలది. లక్స్‌ను మీ సౌందర్యసాధనగా రోజూ వాడండి.

లక్స్ టాయ్‌లెట్ సబ్బు సినీమాతారలకు సౌందర్యమునిచ్చే శుద్ధమైన, సౌమ్యమగు సబ్బు తెలుపులోను, నాలుగు వానవెల్లి రంగుల్లోను వున్నది

హిందూస్థాన్ లీవర్ ఉత్పత్తి

లింటాస్-LTS. 189-140 TL.

# చిరుద్యోగపర్వం 4 నాలుగవ కథ...



# ప్రసన్నవదనం

లేళ్లపల్లి వెంకటలక్ష్మీనారాయణ

చిరుద్యోగాకాదివారం ఆఫీసరు దర్శనార్థం బయల్దేరాడు. విహంగరావెళ్లాక్చిన మొదటాదివారం అది. యీవారం రోజులు చిరుద్యోగిన్చూసి ఆశ్చర్యపడ్డారందరూ. 'ఏం కథ, యి. బి. దగ్గర యున్నాళ్లూ పట్టావ్..యి. బి. అవతల పడేశారా ఏం' అన్నారు. 'యి. బి. ఏవిటి? స్కేల్లో చేసే ఎగురు కూడా వొక ఎగురు కింద లెక్కేనా? పోస్టుల్లో కెగిర్తే గొప్ప గాని.. కొన్నాళ్లల్లో పై పోస్టుకెగుర్తాను చూడండ'నుకొని, పైకి మాత్రం 'అబ్బే, ఏంలేదు.. మా మావగారు నలభై రూపాయలు పంపార్లే' అన్నాడు.

'అదీ.. అలాంటిదేదో జరిగింది.. అప్పుడే అనుకున్నాం 'ఏవిటా చిరుద్యోగి హుషారుగా వున్నాడ'ని అని అన్నారంతా.. 'అయితే మరి సినిమా కెడుతున్నావా?' అన్నారు మళ్లీ.

'అబ్బే, కిందటినెల్లో తప్పిన గుంటెంకా అట్లాగే వుంది. దాన్నిపూడ్చాలి' అని ముప్పు తప్పించుకున్నాడు. లేకపోతే వాళ్ల కోసం సినిమా చూస్తే యింకో గుంట తవ్వాలసొస్తుంది.

చిరుద్యోగాఫీసరు పేరు భజగోవిందరావు. వెనకాల్తిరుగుతూ భజన్చేస్తూ ముందుకొచ్చి గోవిందలు కొట్టే వాళ్లంటే భజగోవిందరావు కెక్కాల్లేని అపేక్ష. గోవిందలు కొట్టే వాళ్ల ముందున్న ఫైళ్లలాగేసి కొట్టని వాళ్ల కంటగట్టాడు. గోవిందలు కొట్టని వాళ్లని కొట్టొచ్చేట్టు చూస్తాడు. వాళ్లు చచ్చేట్టు వచ్చేసినానరే భజగోవిందరావింట్లో ఓ 'చార్టు'ంది. ఆఫీసులో గోవిందలు కొట్టేందెవరో కొట్టందెవరో చూపిస్తుంటది. అంతేకాదు.. ఎవరెవరెన్నిసార్లు కొట్టారో కూడా చూపిస్తుంటది. ఆ చార్టు చూసి భజగోవిందరావు గోవిందలు కొట్టిన నిష్పత్తితో పని డిస్ట్రిబ్యూట్ చేస్తాడు క్లర్కుల మధ్య. అదే వరసలో ప్రమోషన్లు కూడా యిస్తాడు. గోవిందలు కొట్టేవాళ్లని చూసీ చూణ్ణట్టు పోనివ్వడమే కాకుండా, చూసికూడా చూణ్ణట్టు పోనిస్తాడు. వాళ్లని అంతే, వాళ్లు చేసే తప్పుల్ని అంతే. కొట్టనివాళ్లని మాత్రం తప్పుల్లేకపోయినా తప్పుల్జేశారంటాడు. తప్పులన్నాకానంటాడు. చూపిస్తాడు పైగా. యిలా చూసీ చూడ్నట్టుండటం కొత్తలో కష్టంగా వుండేది. అందుకని కళ్లు మూసుకోడంతో మొదలెట్టాడా విద్య. యిప్పుడా అవసరం లేకుండా ఆఫీసుకు రాంగానే నిద్రపోతాడు. సాయంకాలం అయ్యేంతవరకు కళ్లు తెరుపులు పడవ్. మధ్యలో అప్పుడప్పుడు గోవిందలు కొట్టని వాళ్లమీదసి ఎరుపులు పడ్తాయ్.. అంతే.. చార్టులో ఏరాంకుంటె ఆఫీసులో అదే రాంకొస్తుంది క్లర్కులకి. భజగోవిందరావు దగ్గరున్న చార్టులో చిరుద్యోగి కిందున్నాడు. అందుకనే ఆఫీసులో ఫైళ్ల కిందున్నాడు. అర్ధరాత్రి దాకా కూడా వుంటున్నాడు.. అలా చార్టులో కిందబడి కొట్టుకుంటున్న వాళ్లు భజగోవిందరావు ప్రమేయం లేకుండా పైకెళ్లిన కేసులున్నయ్. దానిక్కారణం భజగోవిందరావు గారి ధర్మపత్ని పేరు సత్యభామాదేవి. అత్యవసర పరిస్థితుల్లో ఆవిణ్ణి కల్పుకుని 'పక్కావిడట్లా, పక్కబజార్లో ఆవిడట్లా' అని, ఎదురింటావిడ మీద పద్దేవాలు, ఎక్కడో వున్నావిడ మీద ఎకసెక్కాలు చెప్పి, వాళ్లంతా మీ సాటిరికాదు..' అంటె సత్యభామాదేవిగారి కెక్కాల్లేని సంతోషం వస్తుంది. వెంటనే చార్టు తెచ్చి ముందుంచి 'యిందులో నువ్వెక్కడున్నావో చూణ్ణా యివా.. కొంచెం పైకెక్కిస్తాను' అంటుంది. అలాంటి సత్యభామాదేవి గారెప్పుడూ భజగోవిందరావు నడుగుతూ వుంటుంది. 'ఏమండీ యీ చార్టులో కిందున్న మనిషెవరు? యిన్నాఫీసులు చూశానుగాని, యిన్నాళ్ళట్లా కింద పడున్నవాణ్ణి చూళ్లేదు.. అతడేవన్నా మూగవాడా?.. మూగైతే కాళ్లేవయినా, చేతులేవైనయ్.. ఒహవేళ చేతుల్లేకపోతే బజార్లో బోల్డు బుట్టలుంటె..హా' అంటూ. 'అహ... అదేంకాదు. అతగాడో • పోస్టుగ్రాడ్యుయేట్. యుర్నీసీగా వుంటున్నాడు. చిన్నప్పట్నించి అంతా సొంతంగా చెయ్యాలనే అపేక్ష. చదువుకునే రోజుల్లో ప్రయివేట్లు, పాఠాలు చెప్పుకుని చదువుకున్నాట్ట.

సరే.. అప్పుడు సొంతలేఖలా వ్రాశ్శేసుకో.. అదే ఎప్పుడూ జీవితాంతం సాగాలంటె ఎట్లాకుదుర్తుంది.. ఆమాత్రం లోకజ్ఞానం మరీ తక్కువ. ఆ మాటే మొన్న కమిటీ వాళ్లు అయ్యేయుస్ కెళ్లే కుర్రాళ్ల గురించన్నారు..' అన్చెప్పేవాడు భజగోవిందరావు.

'అసలొక్కసారి కూడా మనింటి కొచ్చినట్టులేదు..' అనేది సత్యభామాదేవి.

'మనింటికి?.. భలేదానివే నువ్వు. ఆఫీసులో వున్న నా దగ్గిరకే రాడెప్పుడూ' అన్నాడు భజగోవిందరావు. 'యింకా కొన్నాళ్లిక్కడ కిందపడేసి అక్కడాఫీసులో సైకిళ్ల మీద పడేస్తేగాని తెల్లారదు' అన్నాడు, మళ్లీ.

భజగోవిందరావిల్లు వెతుక్కుంటూ వెడుతున్నాడు చిరుద్యోగి. పోస్టుమేనొక్కడుంటె కేకేసి అడుగుదా మనుకుంటె, వాడు చిరుద్యోగిన్చూడకుండా ముందుకే చూస్తూ లొప్పుతూ సైకిలు తొక్కుతూపోతున్నాడు. చిరుద్యోగి క్కోపం వచ్చి యితగాడ్చేసే రాచకార్యం ఏవిటి? చూడకుండా పోతున్నాడని విసుక్కున్నాడు. ఈలోగా చిరుద్యోగెదురుగా వున్న యింటోంచోకాయన బయటకొచ్చి నిలబడ్డాడు. చిరుద్యోగి 'సార్, యిక్కడ భజగోవిందరావుగా రిల్లెక్కడండి' అన్నాడు. ఆయన చిరుద్యోగిని కొట్టొచ్చేట్టు చూశాడు. చిర్రుబుర్రు లాడుతూ గేటు 'ఫెడేల్' మనివేసి లోపలికి పోయాడు. చిరుద్యోగి నిర్ఘాంతపోయాడు. 'ఆయనకేవన్నా పిచ్చేమోలే' అని సరిపెట్టుకున్నాడు. సరిపెట్టుకోక చేసేది కూడా ఏంలేదు..

అదో చిన్నబజారు. బజారు మీద మనుష్యులెవరూ తిరగటల్లేదు.. యింతలో నాలుగిళ్ల వతల్నుంచోకాయన చొక్కావేసుకుంటూ చిరుద్యోగి వేపు పరిగెత్తుకొస్తున్నాడు.. ఆయన చిరుద్యోగి దగ్గరకొచ్చాడు. 'ఏం, అబ్బాయ్, మావరండాలో కూర్చుని నిన్నిందాకే చూశాను. కానీ పైకెడుతున్నా వనుకున్నా. ఎవరింటి కోసవైనా వెతుకుతున్నావా? పేర్చెప్పు చాలు.. యింటి పేరు కూడా అక్కర్లేదు. యీ పేటలో వున్నాడంటె చెప్పేస్తాను' అన్నాడాయన ఆపద్బాంధవుడిలా.. ఆపద్బాంధవుడి పేరు లోకనాథంగారు. పబ్లిక్ యిన్ఫర్మేషన్ బ్యూరోలో ఏదో పనేసి రిటరయియ్యాడు. పూర్వప్పు వాసనింకా పోలేదు. ఆ పేటలో వున్న ఇళ్ల సంగతి, దాంట్లో వున్న వాళ్ల సంగతులు స్వీకరించి పదిమందికి చెప్తుంటారాయన. లోకనాథం గార్తో చిరుద్యోగన్నాడు, 'ఏవిటండీ, మీ బజార్లో మాటసహాయం కూడా చెయ్యరు. యిందాక ఆ పోస్టుమేనంతే.. యిప్పుడీ ఎదురింటాయనా అంతే.' లోకనాథంగారు నవ్వారు. 'అబ్బాయ్, యీ బజార్లో.. ఆ బజార్లో అనేవిటి... యీ పేటలో నే నొక్కణ్ణి మాటసహాయం చేసేది. అందుకని మిగతావాళ్లు చెయ్యటం మానుకున్నారిప్పుడు. అసలు వాళ్లకా అవకాశం నేనివ్వను... కానీ నువ్వు పైకెడుతున్నా వనుకున్నా. లేకపోతే వాళ్లందర్నీ అడగాల్సిన అవసరం నీకుండేదికాదు. అప్పటికే నువ్విక్కడ తారట్లాడటం చూసి పరిగెత్తుకుంటూనే వచ్చాను. సరే ఆ పోస్టుమేనంగతా? వాడీ బజారొచ్చి 'రయ్' మంటూ యిళ్లన్నీ వదిలేసి ముందా పై మూడిళ్లకీ వెళ్లి యిచ్చిరావాలి.. దాని వెనకాలో కథుందిలే.. చెవుతానుండు.. అలా నీడలో కెడదాంపద' అని చిరుద్యోగిని అక్కడో చెట్టు కిందికి లాక్కెళ్లాడు.. చెట్టు కిందికి లాక్కెడ్తూండగా అ పక్కనే వోకాయన సైకిలు మీదెడ్తుంటె లోకనాథంగారు చప్పట్లు కొట్టాడు. 'సత్యనారాయణ, మూర్తిగారూ.. మాట' అంటూ. ఆయనాగాడు. 'ఆ,.. యిందా కొకాయనిక్కడ మీ యింటి కోసం వెతుకుతుంటె పంపించాను.. వచ్చాడా?' అన్నాడు లోకనాథంగారు. 'వచ్చాడు.. నే నొస్తాను' అంటూ ఆయన సైకిలెక్కి బయల్దేరాడు. 'యీాయన సత్యనారాయణమూర్తిగారని.. లెక్చెరరు చేస్తున్నాడు.. కుర్రాడు చాకులా వుంటాడు.. కుర్రాడయినా మాంచి బుద్ధిమంతుడు....ఆ ఏం చెవుతున్నాను.. ఆ పోస్టుమేన్సంగతి కదూ..' అంటూ మళ్లీ మొదలెట్టాడు లోకనాథంగారు.

'అవన్నీ నాకెందుకండీ?..నాకో యిల్లు కావాలి.. ఆయన పేరు..' అంటూ చెప్పబోయాడు చిరుద్యోగి.

'ఆగవయ్యా, నీ యిల్లు బంగారంగాను.. యివ్వాళాదివారవేగా? ఎందుకంత తొందర? నాకూ ఏం తోచ్చావదు రోజూ.. యీ ఆదివారాలొస్తే నీలాటి వాళ్లు కనిపిస్తారు.. ఏవో కబుర్లు చెపుతుంటె కాస్త హాయిగా వుంటుంది.. యీ పోస్టుమేన్సంగతి కదూ నే చెప్పొచ్చింది.. కిందటి జేష్ఠమాసంలో ఆ మూడిళ్లల్లో వున్నమ్మాయిలకే పెళ్లిళ్లయిన్నై. పెళ్లిళ్లయి పదిహేన్రోజులింకా రాకుండానే ఆషాఢ మాస వొచ్చేసింది. దాంతో అల్లుళ్లకి వెళ్లిపొమ్మని ఆర్డర్లొచ్చాయ్.. వాళ్లు రోజుకో పుత్తరం రాస్తానని అమ్మాయిలు కూడా రాయాలని ఎన్నోసార్లు చెప్పి వెనక్కి చూసుకుంటూ వెళ్లిపోయారు. పిచ్చివెధవలు.. యిక్కడీ అమ్మాయిలు ఆ పుత్తరం చూసిగానీ భోం చెయ్యర్ట. అక్కడా మొగుళ్లు అంతేట... యీకాలం పిల్లలకి మరీ పిచ్చెక్కువయ్యింది. మారోజుల్లో యిలా వుండేదా? పెళ్లి చేసుకున్న పదేళ్ల దాకా మాట్లాడుకునే వాళ్లమా? ఉత్తరాలు రాసుకునే వాళ్లమా? యిప్పటికక్కూడా మా ఆవిడ నాకో వుత్తరం కూడా రాయదు. మా పెద్దబ్బాయిక్కు రాయాల్సిందేగాని దాన్ని గురించి. మా ఆవిడ మా పెద్దబ్బాయి దగ్గరుంటోందిప్పు మా పెద్దబ్బాయ్ మెడ్రాస్లో ప్రొఫెసర్గా వుంటున్నాళ్లే.. మా రెండో వాడిక్కడే యింజనీర్చేస్తున్నాడు. మా మూడోవాడు..



'అయ్యా, లోకనాథంగారూ.. నాకవన్నీ అక్కర్లేదుగానీ... భజగో...'

'ఉండవయ్యా.. నీ అత్రం కూలిపోనూ! ఆ పోస్టుమేన్ కథన్నా సాంతం చెప్పనిస్తావా? అలా అమ్మాయిలు అన్నం తినకుండా ఎదురుచూస్తూ వుంటారని వీళ్లని తొందరగా రమ్మంటారు. అంతో యింతో ముట్టచెవుతారనుకో.. అదిగో, అట్చూడు. ఆ మావిడి చెట్టింటోంచి బయటకొచ్చి పుత్తరం తీసుకుంటోందే.. ఆ అమ్మాయి పేరు రాజకుమారి. నిజంగా రాజకుమారే ననుకో. కళకళ్లాడుతూ తిరుగుతూంటుంది. యీ మధ్యే కష్టపడ్డదివి పరీక్ష వ్రాసింది.. యిప్పుడా డాబా మీద కూర్చుని రెస్టు తీసుకుంటోంది.. మా మనవరాలి స్నేహితురాలు.. ఆ అమ్మాయికీ మొన్నే పెళ్లయ్యింది. ఓటగాడేదో వుద్యోగం చేస్తున్నా డెక్కడో. ఆషాఢమాస వొచ్చిన రోజునే వచ్చిందో

తెల్సా.. భలే పన్జరిగింది.. అతగాడెళ్ళనంటాడే.. నాకివన్నీ ఎట్లా తెలుసంటే, ఆ రాత్రి పదకొండింటికో పన్నెండింటికో ఒకాయనొచ్చి విసినాథంగారిల్లు కావాలంటే ఆయున్నక్కడదించి, దార్లో యింకో ఆయనకి సుబ్రహ్మణ్యంగారిల్లు చూపించి తిరిగొస్తుంటే యీ రాజకుమారీ వాళ్ళింటోంచి మాటలు వినిపిస్తున్నయ్

'అమ్మాయ్, రాజా.. టైం పదకొండు గంటల ఏభై నిమిషాలయ్యింది. పన్నెండు గంటలకి ఆషాడమాస మొస్తుంది..' అని అరుస్తోంది అనంతలక్ష్మమ్మగారు. ఆవిడ రాజకుమారి తల్లి. ఎదురుగా గడియారం పెట్టుక్కూర్చుంది. అంతకు ముందు మూడుసార్లు అలారం కొట్టించి వార్నింగిచ్చిందిట. కానీ పిల్లాడు పిల్లదీ ఏవేవిటో మాట్లాడుకుంటున్నారు. విన్లేదు. యిలాగా చివరో అరుపరిచిందీవిడ. అల్లుడు, బయటకొచ్చాడు. అతని వెనకాలే పిల్లది కూడా వొచ్చింది.

'ఆషాడమాసం రానీండి, ఏంబోయింది.. నాకింకా పదిరోజుల శలవుంది' అన్నాడల్లుడు.

'హవుతే, రాజా! నువ్వాసంగతి చెప్పనే లేదుకే' అందావిడ కూతురువంక చూస్తూ. కూతురు తలడ్డంగా తిప్పింది. పిల్లదాంతో 'ఆషాడమాస మొస్తోంది. మీరెళ్ళిపోవాల'ని చెప్పమందిట. తల్లి దగ్గిర తలాడించి మొగుడ్దగ్గిర మొహమాటపడింది పిల్లది. ఆ విషయం చెప్పలేదు. చెప్పలేకపోయింది పాపం.

'అది కాదల్లుడూ.. ఆషాడమాసంలో అత్తాకోడలూ, అత్తా అల్లుడూ గడపదాటకూడదంటారు. అందుకని నువ్వీక్షణంలో వెళ్ళిపోవాలి' అందావిడ. అల్లుడదిరిపడ్డాడు భూకంప మొచ్చినట్టు. 'యిదేవిటి' అన్నట్టు పెళ్ళాంవంక చూశాడు.

'శాస్త్రాలూ, పెద్దాళ్ళ ఆజ్ఞ' అన్నట్టు చూసింది పిల్లది.

'యింతర్థాంతరంగా చెపుతే ఎట్లాగండి?.. ఓ గంట క్రితం చెపితే యీ యింటి కున్న గడపలన్నీ పీకేసేవాణ్ణిగా. అప్పుడు గడపదాట్టమనే పాయింటే వుండేదికాదు... పోనీ యిప్పుడు మాత్రమేం మునిగిపోయింది లెండి. యింకో అయిదు నిమిషాలు టైం వుందిగా. ఓ పలుగుప్పించండి.. తవ్వేస్తాను.. వూ, యింకా కూర్చుంటారేం..లేవండి' అని



తొందరపెట్టాడు.

'మంచివాడివే.. యిప్పటికే నీ కిచ్చిన కట్నంతోనే మునిగిపోయాము. యిప్పుడీ గడపలు పీకేశావంటే బాగు చేయించేసరికి అంతకంతయ్యి తడిసి మోపెడవుతుంది... యివన్నీ ఎందుగ్గానీ, ఆషాడమాస వెళ్ళాక రావచ్చు.. యిప్పుడెళ్ళిపో' అందావిడ. అల్లుడాలోచించాడు. 'పోనీ, యిలా చేద్దాం.. మీరూ నేను గడపదాటకూడదనేగా నన్నెళ్ళమంటున్నారు. యిద్దర్లో ఎవరెళ్ళినా, ఆ గడపదాట్టం అనే ప్రమాదం వుండదు కదా?.. అందుకని నేనే ఎందుకెళ్ళటం.. మీరెళ్ళిపోలా.. కాబట్టి మీరెళ్ళండి' అన్నాడు. మళ్ళీ వెంటనే 'గడపల్తవ్వేస్తే చేయిస్తానికి కట్నమంతవుతుంది కాబట్టి అంతవ్వకుండా అందులో అయిదో వంతయ్యే వుపాయం నేం చెపుతాను.. మీరించక్కాగా



కాశీ రామేశ్వరం వెళ్ళండి.. బోల్డు పుణ్యం కూడా వస్తుంది' అన్నాడు.

'బాబూ, నా కింకా పుణ్యాలేం అక్కర్లేదు. యిప్పటికే బోల్డు పుణ్యం వుంది. నువ్వల్లుడివయ్యాక యింకా ఎక్కువైంది. ఆ సంగతెల్సి యీ బజార్లో వాళ్ళంతా ప్రతి మధ్యాహ్నం వచ్చి అప్పు తీసుకెడుతున్నారు పుణ్యాన్ని. వాళ్ళా అప్పు తీర్చిస్తే యింకా బోల్డు పెరుగుతుంది కూడా... అందుకని నీ సలహా ఏం బాగాలేదు. అయ్యో, యింకా రెండు నిమిషాలే టైం' అంది. అల్లుడి సూటుకేస్ తెచ్చి వసారాలో పెట్టింది. అల్లుడు బూట్లు తొడుక్కుంటున్నాడు. తొడుక్కుంటున్న వాడల్లా ఆగి,

'పోనీ, యింకో పన్చేద్దాం.. మీరు కాశీ వెళ్ళొద్దు. మేమిద్దరం కాశ్మీరెడ్తాం,' అన్నాడు.

'అబ్బాయ్, ఆ తిరగటాలన్నీ యిప్పుడు కాదు. యిప్పుడు నువ్వొక్కడివే తిరిగెళ్ళు' అంది. ఎట్లాగయితేనేం పన్నెండు గాకముందే అల్లుణ్ణి బజార్లోకొచ్చి నిలబడి పిల్లదాంతో ఏవేవిటో మాట్లాడుతూనే వున్నాడు వొంటిగంట దాకా. 'ఏం చేస్తాం. పెనుభూతంలా వచ్చింది ఆషాఢమాసం' అంటూ సరిపెట్టుకున్నారిద్దరూ. అతగాడు వెనక్కి తిరిగి చూసుకుంటూ వెళ్ళిపోయాడు. నేనక్కడే వున్న చెట్టుకింద నిలబడి..నన్ను కూడా చూళ్ళేదు.. ఉద్యోగం చేసే పూరి శ్లాం చేశాడో తెల్సా.. ఆ, అన్నట్టు, అతగాడేదో రిసర్చి చేస్తున్నాట్ట.. తన్చేసే రిసర్చి టాపిక్కు మార్చేసి 'గడపల్లేని యిళ్ళు వాటి ఆవశ్యకత, వాటి కవకాశాలు' అన్న దానిమీద చేస్తున్నాట్టిప్పుడు' అంటూ ఆగాడు లోకనాథంగారు.

'లోకనాథంగారూ! ఈ కథయ్యిందా?.. యింకో కథని నన్నంపకుండా నేనడిగే ఇల్లు సంగతి చెప్పండి' అన్నాడు చిరుద్యోగి...

'యిప్పుడ్దాన్సంగతే చెపుతాను.. కానీ దాని ముందింకో టడిగావ్ చూశావ్.. యీ ఎదురింటాయిన నువ్వేదో అడిగితే 'ఫెడేల్' మని గేటేశాడు.. ఏం అడిగావ్?.. కొంపదీసి భజగోవిందరావని ఆఫీసరువున్నాడే, ఆయన గురించా? నువ్వాయనిల్లు వెతికేది' అన్నాడు.

'అవున'న్నాడు చిరుద్యోగి.

'చంపావ్ పో.. 'ఫెడేల్' మని గేటేసినాయిన పేరు కోటేశ్వర్రావు. వళ్ళకోటేసుకుని కోర్టు దగ్గర్దాకా పోవటం వుద్యోగం. కోర్టు లోపలకెడ్దామంటే కేసొకటీరాదు. కానీ బజార్లో అందర్తో పోట్లాడ్తూ వుంటాడు. అయినకాడి కప్పుల్చేస్తూ వుంటాడు. ఆ పక్కింట్లోనే మా భజగోవిందానిది. వీళ్ళిద్దరికీ క్షణంపడదు. వీళ్ళిద్దరూ వొకళ్ళ మొహాదొకళ్ళు చూపుల్లో నిప్పులు కురిపించుకుంటారు.. మొన్న సంక్రాంతికేమయ్యిందో తెల్సా?.. భోగినాడు పొద్దున్నే భోగిమంటేద్దామని పిల్లలందరూ పుల్లలన్నీ అక్కడ పేర్చారు. అగ్గిపెట్టె తెస్తామని వెళ్ళారు. యీలోపల పిల్లాణ్ణెత్తుకుని బయటికి మా భజగోవిందరావొచ్చాడు. ఆవేళ్టికే అవతల గడపలోంచి పిల్లాణ్ణెత్తుకుని కోటేశ్వర్రావు బయటకొచ్చాడు. యిద్దరూ వొకళ్ళనొకళ్ళు చూసుకున్నారు. మొహాల్తిప్పేసుకుని యిద్దరిగా రోడ్ను మీద

పిల్లలుంచిన పుల్లల్లోంకి చూశాలు..అంతే. భగ్గుమని మండినై పుల్లలు. వాళ్ళిద్దర్కీ అంత గొప్పవిరోధం.. జాగర్తగా విను..ఆ రెండిళ్ళల్లోంచీ ఏవిటి వినిపిస్తోంది', అన్నాడు లోకనాథంగారు.

'ఆ.. ఏదో నవార్తున్నట్టున్నారు'అన్నాడు చిరుద్యోగి.

'సరిగ్గా చెప్పావ్.. భజగోవిందరావింట్లో కారాలు నవార్తున్నాడు. కోటేశ్వర్రావింట్లో మిరియాలు నవార్తున్నాడు. యిద్దర్నీ మిరపకాయల వాణ్ణీ, మిరియాల వాణ్ణీ వెతనెట్టుకున్నారు...

'అదేవిటి లోకనాథంగారూ.. యిద్దరూ యిరుగుపొరుగు వాళ్ళు.. మరీ అంత విడ్డూరవాఁ? నాకు నమ్మకం కుదర్టల్లేదు' అన్నాడు చిరుద్యోగి.

'నమ్మకం కుదర్టల్లా?... యిందాక కోటేశ్వరావుని · దూరాన్నుంచడిగావ్. దగ్గరి కెళ్ళడిగితే నీకీ అనుమానం వుండేదికాదు... మొన్నొకాయిన కోటేశ్వర్రావు దగ్గరికెళ్ళి 'లయ్యా, యిక్కడ భజగోవిందరావుగా రిల్లెక్కడ' అన్నాడు. ఆవేళ్టికే పక్కింట్లో భజగోవిందం వరండాలోంచి చూస్తున్నాడు. అది చూసి కోటేశ్వర్రావు 'అడ్డమైన గాడిద కొడుగ్గురించీ అడిగితే నాకేం తెలుస్తుం దయ్యా? అడ్డమైన వెధవల గురించీ అడ్డమైన వాళ్ళందరికీ చెప్పటమేనా నాపని. నాకు బోల్డు కొర్పు పనుంద'ని లోపలికెళ్ళాడు. నేనిదంతా మా యింట్లోంచి చూస్తూనే వున్నాను. కోటేశ్వర్రావు లోపలి కెళ్ళేక ఆ అడిగిన పెద్దమనిషొంక'చూశాను. పెద్ద మనిషి సరిగా కనపళ్ళేదు.

'యిదేవిటా, యిందాక బాగానే కనిపించింది మొహం. యిప్పుడేవయ్యిందా' అనుకున్నా. కళ్ళజోడ్తీశానేమోనని చూస్తే కళ్ళజోడు కళ్ళ మీదే వుంది. 'యిదేవిటా' అని ఆ పెద్దమనిషి దగ్గర కెళ్ళి చూశా. కోటేశ్వర్రావన్న మాటల్తో అతగాడు మొహం 'యింత' చేసుకున్నాడు. పెద్దమనిషి మొహం చిన్నబోయింది. దూరాన్ని క్కనిపించలేదందుకనే.. అలాటి దేదో నీక్కూ జరిగితే యీ అనుమానం వుండేదికాదు... పోనీ అటుచూడు. కోటేశ్వర్రావింటి మీద మూడుకాకులున్నయ్. పక్కింటి భజగోవిందం యింటి మీద మిరపకాయలు, వడియాలు ఎండబెట్టాడు. పక్కింటి మీద కాకులుంటె భయం లేకుండా ఎలా

# చిరుద్యోగపర్వం



ఎండబెట్టగల్గారంటావ్? అక్కడెవరన్నా కాపలా వున్నా రనుకుంటున్నావా?.. ఎవ్వరూ లేరు.. ఎవ్వరూ కాపలా లేకుండా ఎలా ఎండ బెట్టగల్గారంటావ్?.. యీ మాత్రం తెలీదూ?.. ఆ యింటి మీద కాకి యీ యింటి మీద వాల్దు. నమ్మకం కుదర్లేదా? సరే, చూపిస్తానుండు' అని లోకనాథం చిన్న రాయొకటి తీసి కోటేశ్వర్రావు కాకుల మీదికి విసిరాడు. కాకు లెగిరి మళ్ళీ అక్కడే కూర్చున్నాయ్. వరసగా రాళ్ళు విసిరాడు లోకనాథం.. యిహ యిక్కడ లాభంలేదనుకుని అక్కడికో ఫర్లాంగు దూరంలో వున్న చెట్టు మీదికెగిరి పోయినై. అంతేగాని ప్రక్కనున్న భజగోవిందరావింటి వంక కూడా చూళ్ళేదు.

'యిప్పుడయినా నమ్ముతావా?' అన్నాడు లోకనాథంగారు. తలూపాడు చిరుద్యోగి. 'ఆ మధ్యేవయ్యిందో తెల్సా..' మళ్ళీ మొదలెట్టాడు లోకనాథంగారు.

'మధ్యాన్నం అయింది లోకనాథంగారూ. యిల్లు చూపించారు. నేనెళ్ళి భజగోవిందరావు గార్తో మాట్లాడి యింటి కెళ్ళాలి.. యిహ వించి టౌస్తూనే వుంటాగా భజగోవిందరావు గార్దగ్గరికి.. అప్పుడు చెప్పుకుందాం కథలు.. అన్నట్టుదుగో! ఆయనెవరో రిక్షాలోంచి దిగుతున్నాడు. ఎవరిల్లన్నా కావాలేవో వెళ్ళండి, పరిగెత్తండి' అన్నాడు చిరుద్యోగి. 'ఎక్కడం'టూ లోకనాథంగారు వెనక్కి తిరిగిచూసి దూరంగా రిక్షానోదాన్ని చూసి అటువేపరిగెత్తాడు. చిరుద్యోగి భజగోవిందరావింట్లో కెళ్ళాడు.

భజగోవిందరావు మధ్యహాల్లో కుర్చీలో పడుకున్నాడు. రెండేళ్ళ పిల్లాడు వరండాలో బొమ్మల్తో ఆడుకుంటున్నాడు. వరండాలో వున్న పిల్లాడు గేటు దగ్గరున్న చిరుద్యోగికి కనపిస్తాడుగాని భజగోవిందరావుక్కనిపించడు. పరిస్థితి నర్థం చేసుకున్న చిరుద్యోగి 'అయ్యో, అయ్యో' అంటూ వరండాలో పిల్లాడి దగ్గరికి పరిగెత్తి సుబ్బరంగా ఆడుకుంటున్న కుర్రాణ్ణెత్తుకున్నాడు. 'ఏం జరిగిందేం జరిగిందంటూ హాల్లోంచి పరిగెత్తు కొచ్చాడు భజగోవిందరావు.

'యిప్పుడేం జరగలేదులెండి. ఒక్క క్షణం ఆలిశ్యమయితే పిల్లాడు వరండా మించి ఆ చెట్ల మధ్య పడిపొయ్యేవాడు. గట్టు చివరి కొచ్చేశాడు. అబ్బ! వరండా లింత ఎత్తుగా వుంటె చాలా డేంజరండి' అన్నాడు చిరుద్యోగి. 'ఏవి టేవిటం'టూ వంటింట్లోంచి సత్యభామాదేవి పరిగెత్తు కొచ్చింది.

'అబ్బే, ఏంలేదు. మీరు ఖంగారు పడకండి పిన్నిగారూ! ఏం అవ్వలేదు. పిల్లాడింకొంచెమయితే పడిపోయేవాడు. సమయానికి నేనొచ్చి పట్టుకున్నాను. అంటూ పిల్లాణ్ణి ముద్దెట్టుకుని ఆవిడ కిచ్చి 'నమస్కారాలండి' అన్నాడు భజగోవిందర్రావేపూ, సత్యభామాదేవ్వేపూ చూస్తూ. 'ఆ..కూర్చోవయ్యా చిరుద్యోగి! అంటూ భజగోవిందరావు కుర్చీలో కూర్చున్నాడు. చిరుద్యోగి పక్కనే వున్న కుర్చీ వదిలేసి ఆపక్కనున్న బల్ల మీద కూర్చున్నాడు. కూర్చున్న వాడల్లా ఎగిరి పడిలేస్తూ 'ఛయ్, ఛయ్' అని పిన్నిగారూ! కుక్కొడ్తోంది వంటింట్లోకి' అన్నాడు.సత్యభామాదేవిగారు వంటింట్లోకెళ్ళి కుక్కని 'కంయ్' మనిపించి వరండాలో కొచ్చింది.

'అదంతే నాయినా! యిందాకణ్ణించి ఆవంటింటి గుమ్మం దగ్గిరే కాచుక్కూర్చుంది. నేనిటొచ్చేసరికి వంటింటి ప్రవేశం చేసింది. యింకా నయం చెప్పావ్.. యిప్పుడే రెండు వీశల నెయ్యి కాచి పెట్టాను. అది ముట్టుకుపోయేదే లేకపోతే.. ఆపక్కింటి కోటేశ్వర్రావుదా కుక్క. దొంగముండా వాడు కావాలనే యిటు తోల్తాడు' అంది సత్యభామాదేవిగారు.

'అట్టానా.. యిద్దరి కాళ్ళూ విరగ్గొట్టొస్తానుండండి' అంటూ లేచాడు చిరుద్యోగి.

'ఎందుకులే నాయినా.. అదెళ్ళిపోయిందిగా' అంది సత్యభామాదేవి.





# Nital

MEDICATED PIMPLE CREAM

(నిటాల్ మొటిమల మందు)

రూ. 1.90 మాత్రమే

## 7 రోజులు వాడితేనే చాలు

క్రిమిసంహారక పదార్థాలతో తయారుచేయబడిన నిటాల్‌ను డాక్టర్లు సిఫారసు చేస్తారు. చర్మానికి హాయిని చేకూర్చి, శుభ్రపరుస్తుంది.

★ చక్కని సువాసన.

నిటాల్ మొటిమల మందు సురక్షితంగా, హాయిగా, పూర్తిగా మొటిమలను తొలగిస్తుంది. చర్మంలోనికి పోయి, ముమ్ముందు తిరిగి మొటిమలను లేవకుండా చేస్తుంది. లోపలికంతా పోవడంచేత మొదలంటా మొటిమలను తీసివేస్తుంది. మొటిమలు ఎండి పడిపోగలవు. దీన్ని వాడిన తర్వాత ఇతర దోషాలేమీ వుండవు. మచ్చలుగాని, గుంటలుగాని పడవు.

యువతీ యువకులందరూ వాడవచ్చు. చర్మాన్ని శుభ్రపరచి, నునుపు తేల్చి నిగనిగలాడుతూ యౌవ్వనం ఉట్టిపడేటట్లు చేస్తుంది.

ఉచితం— ఉత్పత్తిదారులకు వ్రాస్తే వివరాలు తెలిపే కరపత్రం పంపగలరు.

ఉత్పత్తిదారులు:
కొచ్చిన్ పామ్ ప్రైవేట్ లిమిటెడ్
నవరత్న హౌస్, ముల్లా రోడ్, కొచ్చిన్-2.

మద్రాసు, మైసూరు, ఆంధ్రప్రదేశ్‌లకు డిస్ట్రిబ్యూటర్లు.

గణపతి అండ్ కంపెని,

103/104, లింగిశెట్టివీధి, పి. ఒ. బాక్స్ నెం. 1986. మద్రాసు—1.

# చిరుద్యోగ పర్వం

'భజగోవిందరావుగారూ! మొన్న మొన్న కోటేశ్వరరావు పక్కన చేరారేమిటండి? కోటేశ్వరరావు కాటేసే రకమండి. మనిషంతా చేదు పుట్ట. కాకరకాయనిపిస్తుంటాడండి. ఆమధ్య కొన్నాళ్ళు అరండల్ పేట్లో వున్నాడు. అక్కడా యిదే తంతు. అప్పు అడగటం.. అప్పు తీర్చకపోతే వాళ్ళ గురించి తప్పుడు ప్రచారం చెయ్యటం. పుచ్చుకున్నప్పుడు ఎగెయ్యటం..ఛీ, ఛీ' అన్నాడు చిరుద్యోగి.

'అవునయ్యా చిరుద్యోగి! మొదట్లో నా దగ్గిరా అప్పుచ్చుకున్నాడు. ఎంతనిస్తాం చెప్పు. ఓ అరవయ్యిచ్చా నక్కడికి.. అది తీర్చకుండా మళ్ళీ అడుగుతాడే.. మళ్ళీ మళ్ళీ యివ్వలేదని అది వరకిచ్చింది తీర్చకుండా మాట్లాడ్డం మానుకున్నాడు ' అన్నాడు భజగోవిందరావు.

'పోనిద్దురూ.. ఏ ఆకుక్కుతినేవాడికో ధర్మం చేశామనుకుందాం.. దొంగముండా వాడు' అంది సత్యభామాదేవి.

'పిన్నిగారూ.. ఆమాటనకండి. కోటేశ్వరరావు వింటె యిహముందుకూడా యివ్వడు. అరండల్ పేట్లో వున్నప్పుడు పక్కింటి




వాళ్ళకి బాకీపడి అనేవాళ్ళకి యివ్వకపోతే వాళ్ళకోపం వచ్చి యిప్పుడు మీరన్నట్టు గానే 'ఏ వెధవకో దానం చేశాం అనుకుంటాం' అంటే, కోటేశ్వరరావు బజార్లోవున్న నలుగుర్నీ పిల్చి యీ మాట వినిపించి, 'యిహానించి బాకీ బాకీ అని నన్నంపకండి. దానం చేశారన్నారు. ఆమాట మీదే వుండండి. మాట తప్పరు.. తప్పినా దానికి వీళ్ళంతా సాక్ష్యం' అని బాకీ సాంతం ఎగేశాడు. బాకీ తీరిందిగా మళ్ళీ అప్పిద్దూ అని వెళ్ళొచ్చి మర్నాడు.. భజగోవిందరావు

గారూ! మీరేమీ అనుకోకపోతే.. మీరు మరీ మొహమాటపడ్తారండి. అంత మొహమాటం పనికి రాదండి..' అన్నాడు చిరుద్యోగి.

'అట్టా చెప్పు నాయినా, మీ ఆఫీసరు గారికి' అంది సత్యభామాదేవి.

'ఆ ఏదో పక్కింటివాడంటె అవసరంతం సహాయం చేస్తే ఏంపోయిందిలే అనుకున్నా' అన్నాడు భజగోవిందరావు మొహమాటా న్నంతా మొహం మీదికి లాక్కొచ్చి.

'అది నిజమేననుకోండి.. కానీ కోటేశ్వరరావుకా?.. అమ్మమ్మ.. కొంపతీసే రకం గదండీ.. మొన్నేం జరిగిందో తెల్సా'అంటూ మొదలెట్టాడు చిరుద్యోగి.

'ఒక్కక్షణం వుండు నాయినా. వంటింటి తలుపు సరిగ్గా వేశానో లేదో చూసొస్తాను' అని లోపలికెళ్ళొచ్చింది సత్యభామాదేవి వచ్చి తిరిగ్గా కూర్చుంటూ 'ఆ.. యిహ చెప్పు నాయినా' అంది.. అవతలి వాళ్ళని గురించిన విషయాలంటె చెవి కోసుకుంటుంది సత్యభామాదేవి. రెండు చెవులపై

నెప్పుడ అలానే కోసేసుకుందంటారు. యిందులో నిజమెంతో అబద్ధమెంతో సరిగ్గా తెలియదు. కానీ వొకమాటే మాత్రం నిజం. ఆవిడ జుట్టు దువ్వకుని అందులో కాస్త రెండు చెవుల మీదికీ లాక్కుంటుంది.. కోసుకున్న చెవులు కనిపించకుండా వుండేందుకలా చేస్తుందంటారు. లేకపోతే ఆ జుట్టు చెవుల మీంచి తియ్యమనండి చూద్దాం' అంటారు. కాని అలా చూసేందు కవకాశం ఆవిడెప్పుడూ యివ్వలేదు. ఆవిడా జుట్టు చెవులమీంచి తియ్యగా చూశ్లే

ఆతురా.. చిరుద్యోగి మొదలెట్టాడు.

'మొన్నొకనాడు నేనాందభవనంలో కాఫీ తాగుతున్నా. కోటేశ్వరరావు నా ఎదురుగా వచ్చి కూర్చున్నాడు. పొద్దున్నే వీడి మొహం చూడాల్సొచ్చిందే విటా అని అనుకున్నా. యివ్వాళేం జరుగుతుందా అని భయపడ్డా..' చెపుతున్న చిరుద్యోగి కడ్డవచ్చి సత్యభామాదేవి 'వాడి మొహం బొగ్గులవ్వా వాడి మొహం చూడగూడదు నాయినా పొద్దున్నే. నేను మొన్న పొద్దున్నే లేచి దొడ్లో కెడితే వీడవతలి వేపు నుంచుని తగుదునమ్మా అంటూ మొహం కడుగుతున్నాడు. భయపడ్తానే వున్నా 'వీడి మొహం చూశానేమిటా' అని. అట్టాగే జరిగింది. పదింటికి నీళ్ళు తోడ్తుంటె కాలు జారి నూతిదగ్గిర 'దబేల్న పడ్డాను.. అప్పుడెప్పుడోనూ అంతే..'అంటూ ఆపకుండా చెప్పుకుపోతుంది సత్యభామాదేవి. భజగోవిందరావుగారు విసుక్కున్నారు. అతన్ని చెప్పనియ్యి..నువ్వుతర్వాత చెపుదువు గాని.... తర్వాతేం వయిందయ్యా' అన్నాడు.

'ఏం వుందండీ అవుతానికి.... యీ లోపల నావెనకాల కుర్చీలో ఎవరో వచ్చి కూర్చునారు. కాఫీ తాగుతున్న కోటేశ్వరరావు నాచేతిలో పేపరు అడక్కుండా లాక్కున్నాడు. నాకు భలే కోపం వచ్చింది. మన పేపర్లింకోవాళ్ళు లాక్కుంటే నాకు భలే కోపం వండి... అహ.... చదవాలను కుంటె కొనుక్కోకూడదూ...'

'వాడంతేనయ్యా చిరుద్యోగి.... పత్రిక తెప్పిస్తాడా... శనివారం పొద్దున్నే కాచుక్కూర్చునేవాడు. పేపరువాడు పత్రిక పడేసిపోంగానే యిటు కోటేశ్వరరావు ప్రత్యక్షం. 'మాస్టారూ! పత్రికొచ్చేసినట్టుందే' అంటూ. అట్ట నీవాడి బొమ్మ చూసేలోపలే అట్టా పట్టుకెళ్ళిపోయే వాడు. తర్వాతర్వాత 'కాస్సేపాగిరండి' అనే వాణ్ణి. అందుకనేం జేసేవాడో తెల్సా? ఆ పండు మొదట్లో నిలబడి పేపరు వాడ్దగ్గిర్నుంచటుడటే అందుకు పోయేవాడు... దగుల్బాజీ మొహం వీడూను' అన్నాడు భజగోవిందరావు. చిరుద్యోగి మొదలెట్టాడు:

'అలా పేపరు లాక్కుని పైకల్లా ఎత్తి, నా మొహం కూడా చూడకుండా, చదవటం మొదలెట్టాడు. అరగంటయ్యింది. యివ్వడే! నా కోపంవచ్చి 'ఏమండోయ్, పేపరు ఇవ్వండ'ని లాక్కున్నా. ఆపాట్ను నా వెనకా

# అశ్రుధార

**సుమన్**




కన్నీళ్ళు కళ్లల్లోనుంచి జారినా హృదయాన్నుంచే. జీవితంలో ఒక్కసారైనా కన్నీళ్ళు విడవకుండా ఎవరూ వుండరు.

కన్నీళ్ళు కొన్ని అనుభూతులు మిగుల్చు తాయంటే నేను నమ్ముతాను.

యీ విషయాలు నాకు అంతకుముందు తెలియవు. నా జీవితం చాల సాఫీగా ఓ చిన్న వాహినిలా దొర్లి యిరవై రెండో మలుపు దగ్గర ఆగింది. యింతవరకు యీ వాహినిలో ఎటువంటి అలల కదలిక, ఎటువంటి సవ్వడి లేదు. అలా ఎందుకు లేదో నాకు తెలియదు కాని, జీవితంలో అనుభవాల ద్వారా కొన్ని పాఠాలు నేర్చుకోగలననే నమ్మకం నాకు వుంది.

నేను వుద్యోగం చేయవలసి వచ్చింది. వుద్యోగంలో చేరిన తర్వాత ఆ వూళ్లో రూమ్ సంపాదించటం కొంచం కష్టంగానే జరిగింది. రూము చాల బాగుంది. ఎల క్ట్రిసిటీ, చక్కని గాలి వస్తుంది. అద్దె కూడ చాల తక్కువ. నేను గది ఎలా వుండా లని అనుకుంటానో అలాగే వుంది.

నేను ఆ గదిలోకి ప్రవేశించటమే జీవితపు మొదటి అనుభవపు సోపానం మీద అడు గిడటము.

మొదటిరోజు కొంచం క్రొత్తగా వుంది. పుస్తకాలను, సామాన్లు, బెడ్డింగ్ వగైరాలను సర్ది తేలికగా గాలి పీల్చాను. ఎంత లేదన్నా బ్రహ్మచారికి కూడ కొన్ని బాధ్యతలున్నాయి. పుస్తకాలు సర్దటం, బెడ్డింగ్ పరుచుకోటం, స్టౌ వెలిగించి కాఫీ కాచుకోటం లాంటివి 'బ్రహ్మచారిమార్కు'కు

అన్నాను.

కొన్ని బాధ్యతలు వాటంతట అవే వెం టాడుతూ వుంటాయి. వీటిని వెనక్కి నెట్టే అధికారం, శక్తి మనిషికిలేదు.

యిలా ఆలోచించుకొంటూ వుండగానే గాజుల చప్పుడయింది. ఆలోచనల పుటల్ని మూసి ఎదురుగా చూశాను.

ఎదురుగా ఓ యువతి నిల్చుని వుంది. చేతిలో ఫలహారం ప్లేటు, మరో చేతిలో కాఫీ గ్లాసు వున్నాయి. వయసు, సుమారు యిరవై సంవత్సరాలు వుంటాయి. పెళ్లి అయిన చిహ్నాలు ఆమె మెడలో ఎక్కడా అగుపడటంలేదు. ఆమె ముఖం వంక చూస్తూ నిశ్చేష్టుడనయ్యాను.

ముఖం నిండా స్ఫోటకం మచ్చలు వున్నాయి. ఆమె అందవికారిగా లెక్కించ వచ్చు. తన కురూపితనాన్ని గురించి బాధ పడుతున్నట్లుగా కన్నులు చెప్తున్నాయి. నల్లగా వున్న కన్నులు నీళ్లతో తడిసి వుబికి వున్నాయి. అతల్ల అడుగున కొన్ని ఆవేదనా స్రవంతులు దాగివున్నాయని గ్రహించాను.

"కాఫీ తీసుకోండి" అని ఫలహారం ప్లేటు ముందు వుంచింది. ఫలహారం, కాఫీ క్రింద గదిలో నుంచి పైకి ఎగుమతి అయివచ్చాయి. వాటిని ఖాళీ చేసేలోపలే ఆమెను గురించి అంతా తెలుసుకున్నాను.

ఆమె సురమ. యింటి యజమాని ఏకైక పుత్రిక. యజమాని లేడు. ఆయన యీ లోకాన్ని వదిలేసి చాల సంవత్సరాలు అయిందట. యీమె బి. యస్.సి ప్యాసయి ఖాళీగా వుంది.

ఆమె వివరాల కన్నా నన్ను ఆలోచించుకో టానికి అవకాశమిచ్చింది ఆమె అందం.. సృష్టిలో సౌందర్యానికి చాల స్థానం వుంది. జీవితంలో కూడ వుంది. జీవితం కూడ సృష్టి అయినప్పుడు బాహ్యంగా కొన్నిటిని జీవితంలో యిముడ్చుకోక తప్పదు.

ఆడది అందంగా వుంటేనే ప్రపంచం ఆమె వంక చూస్తుంది. సంతోషిస్తుంది, అనుభవించుతుంది. బాహ్య సౌందర్యానికి అలవాటుపడ్డ లోకానికి స్త్రీ అందం మత్తు లాంటిది. ఆ మత్తు లేకపోతే ప్రపంచం హింసించటానికి ఏవిధంగాను సంకోచించదు.

సురమ హృదయంలో ఎటువంటి అగ్ని గోళాలు మ్రోగుతూ వుంటాయో నాకు తెలుసు. తను అందంగా లేదని తెలిసి ఆమె రోదించుతుంది. అద్దంలో ముఖం చూస్తు కొన్నప్పుడు ఆ మచ్చలు వెకిలిగా నవ్వుతూ వుంటే ఆమె గుండెలు ఎటు జారిపోతాయో!

తన స్త్రీత్వం మీద నమ్మకం పోగొట్టు కొంటూ వుంటుందా?

స్త్రీని జీవితాన్నుంచి చాలవరకు వంచించు తున్నారు. సృష్టి నుంచి కూడ వంచించితే ముందు ఏమి వుందని అనుకొంటుంది? ఏదైనా హృదయం పొందలేని స్థానం రూపం పొందుతుంది.

యీ ప్రపంచానికి స్త్రీ అంటే అనురాగం
యీ సృష్టికి స్త్రీ అంటే కోపం—
జీవితానికి స్త్రీ అంటే అసహ్యం—
అనుభూతులకు స్త్రీ అంటే భయం—

ఆమెను చూసిన తరువాత యీ ప్రకృతి మీద, యీ లోకం మీద విపరీతమైన ద్వేషం కల్గింది. అయితే దానిని ప్రకటించ టానికి, ఆమె ఆవేదనను తొలగించటానికి నేను కొంత ప్రయత్నం చేయవలసి వుం టుంది. నాలాంటి మనుషులకు భయపడినా, నాలాంటి మనుషులను అనుసరించటం అలవాటులేదు కనుక ఆ ప్రయత్నం నేను చేయగలననే నమ్మకం నాకు వుంది.

ఓ రోజు వుదయం ఆమె నా గదిలోకి వచ్చింది. అప్పటికే నేను ఆ గదిలోకి వచ్చి వారంరోజులు దాటింది.

"వుద్యోగంతో వేసారుకొంటున్నాను. మీరేమంటారు?" అంది. ఆమె వుద్యోగం చేస్తుందంటే నేను ఆశ్చర్యపడను. ఆడది ఆమాత్రం చేస్తే అంత ఎక్కువ సాహసమని కూడ అనను.

"చాల బాగుంటుంది. ఏమిటి వుద్యోగం?" అన్నాను.

"మా ఆఫీసులోనే. యల్. డి. సి.గా యిస్తానన్నారు. చేద్దామని వుంది." అని అంది.

"కంగ్రాచ్యులేషన్స్. యింత త్వరగా యీ వూళ్ళోనే వుద్యోగం సంపాదించినందుకు చాల సంతోషం. వుండండి యిప్పుడే కాఫీ యిస్తాను." అని లేచాను.

ఆమె పెదవుల మీద చిరునవ్వు తెచ్చు కొని కూర్చుంది. కొంచంగా విరిసిన పెదవు లలో నుంచి తెల్లని పలువరుస తళుక్కున మెరిసి మాయమయ్యింది. అయితే, ఆ విరి సిన పెదవులలో ఆవేదనా చలనమే ఎక్కువగా అగుపడింది.

ఆమెనుంచి దృష్టి మళ్ళించి ఫ్లాస్కులో కాఫీ గ్లాసులో పోసి ఆమెకిచ్చి "ఉద్యోగం సంపాదించినందుకు కంగ్రాచ్యులేషన్స్‌తో, పాటు కాఫీ కూడ అనుకోండి" అన్నాను.

ఆమె గ్లాసు అందుకొని "థాంక్స్" చెప్పింది.

ఆమె కాఫీ సిప్ చేస్తుంటే అన్నాను, "బహుశా కాఫీ ఎవరు చేసి వుంటారో గ్రహించే వుంటారనుకొంటాను."

"మీరే చేసి వుంటారు. మీరు రోజూ స్టౌతో కుస్తీపడటం నేను చూస్తూనే వున్నాను లెండి."

అని ఆమె నా ముఖం వంక చూడటం నేను గమనించకపోలేదు. ఆమె అలా నవ్వుతూ వుంటే ఎంతో హాయిగా వుంటుంది. ఆమె కళ్ళల్లో విషాదరేఖలు తొలగిపోవాలని, ఆమె ముఖం సంతోషంతో వెలగాలని ఆశిం చుతాను.

ప్రతివాడిలోను కొంత విషాదం దాగి వుంటుంది. అది అవకాశం వచ్చినపుడు పొంగి పొర్లుతుంది. జీవితంలో అతివిషాదంలో ఓ కన్నీటి బిందువు వదలగలిగితే ఆతర్వాత చచ్చిపోయినా యితరులకు కొంత మిగిల్చి, కొంత వెంట తీసుకు వెళ్ళుతున్నట్లున్నమాట. కురూపితనానికి విషాదానికి దగ్గర సంబంధం వుంది. సౌందర్యానికి సంతోషానికి కూడ అంతే. సౌందర్యం దర్శ చక్షువులకు ఆనందం కలుగజేయటమే కాకుండా బ్రతుక్కి బాటను కూడ వేస్తుంది. అది పిచ్చిగా పరిణమించితే చాల ప్రమాదం. సౌందర్యపు పిచ్చిలో ఎన్ని జీవితాలు ఏమయిందో మన ముందు వున్న చరిత్ర మనకు చెప్పకుండా వదలిపెట్టదు.

హఠాత్తుగా తప్పింది. ఆమె నా ఎదుటే కూర్చొని వుందని, ఆలోచనలో పడితే, నవ్వు, నా చుట్టూ వున్న వాతావరణాన్ని మరచిపోతాను. యీ ఆలోచన ఒక్కటే జీవితాంతం వరకు స్నేహితుడుగా వుండేది.

"మిమ్మల్ని ఒక్కటి అడగనా?" అన్నాను ఆమె వంక చూస్తూ. నా ప్రశ్నకు ఆమె కొంచం కంగారుపడిందికాని, కంగారును అణు చుకోటానికి ప్రయత్నించింది.

"ఏమిటి!" అంది.

"మీరు ఎప్పుడూ దేనిని గురించో ఆలోచిస్తూ వుంటారనుకొంటాను." అన్నాను.

ఆమె మొదట వులిక్కిపడి తరువాత అంది. "నాముఖం చూస్తే మీకు అలా అనిపించి వుంటుంది."

కొంచంసేపు నా కళ్ళల్లోకి చూచి తరు వాత కిటికీలో నుంచి బయటకు చూడ సాగింది. ఏదో చూడటంలో అర్థమేమిటో నాకు తెలుసు. అడుగుతున్న మాటికి జవాబు యివ్వటం యిష్టం లేకపోవటం వలనో చూడటమన్నమాట.

ఆమె కళ్ళల్లోకి సూటిగా చూశాను. కళ్ళల్లో విషాద భాండం బ్రద్దలయి పొంగ టానికి సిద్ధంగా వుంది. పెదవులు నెమ్మ దిగా అదురుతున్నాయి. మనస్సు లోతు చెంపలు గంభీరాన్ని పులుముకున్నాయి. యీ సమయంలో నేను ఏ సానుభూతి వాక్యం పలికినా ఆమె విషాదం ఒక్కసారి ఫౌంటెన్‌లా చిమ్ముతుంది. తరువాత ఆమెను ఎలా వూరడించాలో నాకు తెలియదు.

చాలసేపటి వరకు నేనేమీ మాట్లాడ లేదు. ఆమె కిటికీలోనుంచి బయటకు చూస్తోంది. నేను ఆమె వంక చూస్తున్నాను.

కొంచంసేపటికి మరల నా వంకకు తిరిగి అడిగింది.

"ఆడదానికి బ్రతకాలంటే ఏమికావాలి?"

ఆ ప్రశ్న ఎందుకు అడుగుతూ వుందో నాకు తెలుసు కాబట్టి వెంటనే అన్నాను.

"ఆడదంటే అదిరిపోయే లోకం కావాలి"

"వింతగా వుంది మీ జవాబు. తర్వాత ఏం కావాలో చెప్పండి."

విషాదాన్నుంచి కొంత మార్పు చెందినట్లు వుంది. దానిని గమనించి ఆమెకు మరింత వుత్సాహం కల్గించుదామనే వుద్దేశంతో అన్నాను. "చూడండి సుగుణా! బ్రతుకు అంటే ఆడదానికి ప్రత్యేకమైన క్వాలిఫి కేషన్సు అక్కరలేదు. ప్రతి విషయంలోను ప్రతిక్షణంలోను తను ఆడదే అన్నవిషయం గుర్తు తెచ్చుకోకుండా వుండగలగాలి. అసలు స్త్రీ అంటే మరో పదార్థం లాంటిదని స్త్రీయే అనుకొంటుంది."

"మీ భావాలన్నీ విరుద్ధంగా వున్నాయి. మొదటినుంచి వస్తున్న ఆశయాలను స్త్రీ ఎప్పుడూ మరచిపోదు, మిగిలిన బ్రతుకంతా యితరుల కోసమే."

"అది త్యాగం అనిపించుకోదు. తన కోసం జీవించలేని బలహీనత."

"జీవితంలో అన్నీ వుండాలనుకోటం కూడ దురాశే కాని, కాని.." యింకా ఏదో చెప్పబోయి కన్నులు బాధగా కదిలించి మెట్లు దిగి వెళ్ళిపోసాగింది. ఆమె ఏమి గుర్తుకు వచ్చి వెళ్ళిపోతూ వుందో అర్థ మయినా మెట్లు దిగుతూ వుంటే ఆమె వంక చూశాను. నల్లగా బారుగా వున్న జడ నడుము క్రిందుగా వింత నాట్యం చేస్తోంది. నడుములోని కదలికలు ఆ నాట్యానికి పోటీ

# అశ్రుధార

పడ్డాయి.

ఆమె వెళ్ళిపోయిన తర్వాత కూడ అలాగే చాలసేపు చూస్తూ కూర్చుండిపోయాను.

*　*　*

'ప్రేమించగలిగితే కురూపిని ప్రేమించాలి. ఆపైన చచ్చిపోవటానికి ఆహ్వానం వచ్చినా నిశ్చింతంగా వుండగలను.'

డైరీలో వ్రాసుకున్న యీ వ్యాక్యాన్ని రోజుకు ఒక్కసారైనా చదువుకుంటాను. చదువుకోగానే వెంటనే ప్రకృతి నిర్ణయాలు ద్వంద్వాలు సమాంతరాల, నియమాలు అన్నీ నా మెదడులో సంఘర్షించుతాయి. ప్రకృతిలో వున్న అన్నీ మనిషికి ఎక్కువగా వుపయోగపడ్తాయి. తనముందు ఎదురుపడిన ప్రతిక్షణాన్ని 'జీవితం' లోకి త్రోసివేయా లనుకుంటాడు మనిషి. బాహ్యంగా అగుపడుతున్న కొన్ని వ్యతిరేకాలు అంతర్గతంగా మనిషికి చాల వుపయోగపడుతున్నాయి.

జీవితం కోసం ఆరాటపడేవాడు ప్రతి నిముషాన్నుండి కొంత పిండి వుంజుకోవాలని చూస్తాడు. పుంజుకున్నది వుండంగా మారిన తర్వాత గుండె ఆగి చచ్చిపోతే?

మూడునెలలుగా అందంలేని అమ్మాయితో పరిచయం ఏర్పరచుకొని ఆమెను గురించే ఆలోచిస్తున్నాను. సౌందర్యం అంటే ఆరాధన తగ్గిందా లేక కురూపితనమంటే ప్రేమ, సానుభూతి పెరిగిందా అని ప్రశ్నించుకున్నాను. సంతృప్తికరమైన జవాబు దొరకలేదు.

కొన్ని ప్రశ్నలకు జవాబులు మనసుతోను, జీవితంతోను కూడ దొరకవు. సురమ అంటే నాకు సానుభూతి వుంది. ఆమెను వూరడించగలను. జీవితమంటే ఆశ కలిగించగలను. అయితే ఆ ఆశ ఏస్థాయిలో నిలువగలదో నేను కొంచం వెతుక్కోవలసి వుంటుంది.

ఓ రోజు సాయంత్రం ఆఫీసునుంచి కొంచం ఆలస్యంగా తిరిగివచ్చాను. నాకంటే ముందే వచ్చింది సురమ. నేను వచ్చేసరికి ముందు గదిలో కూర్చుని సురమ వెక్కి వెక్కి ఏడుస్తూ వుంది. ఆమె ఏడుస్తూ వుంటే నా గదిలోకి వెళ్ళాలనిపించలేదు. వెంటనే ఆమె దగ్గరకు వెళ్ళాను. వెనుక దొడ్లో ముసలి తల్లి ఏదో పని చేసుకొంటూ వుంది.

[illegible]

వంచిన తలఎత్తి హఠాత్తుగా నావంక చూసి మరల దించుకొంది. ఆచూపు చూడగానే నాకు గల్గిన భావం యిది—గంతలోని చిన్ని గుండెలను పిండివి అంతటితో వదలిపెట్టక వర్తమానం వెంట కూడ కదాని రాగం తీస్తూ వుంటాయి. బ్రతుక్కి భవిష్యత్, గతాలు తోడ్పడకపోతే వర్తమానం ఒంటరిగా మనిషిని ఏమి చేయలేదు.

ఆమె తన వికారితనాన్ని మరోసారి గుర్తుకు తెచ్చుకొని ఏడుస్తూ వుంది. సురమ కన్నీళ్ళు తుడుచుకొంటూ కూర్చుంది కాని ఏమీ మాట్లాడలేదు. నల్లగా వుబికిన ఆమె కళ్ళవంక చూస్తూ మరల అడిగాను

"ఎందుకు సురమా ఏడుస్తున్నావు?"

"శిశువుకి, ఆననానికి దుఃఖం వుందని తెలుపుకోటానికి దారి అదే"

"ఆ దారి వలన ప్రయోజనం?

"శూన్యమే కావచ్చు. కాని, కన్నీరంతా జారిపోయిన తర్వాత మిగిలిన సారంలేని జీవితం శూన్యంలోకి జారిపోతేనే బాగుంటుంది."

"శూన్యం అందంగా వుండదు."

"అందం శూన్యం వైపు దారి చూపదు. అందరూ అందం కావాలనుకోవచ్చు. కొందరు దురదృష్టవంతులు తనకు లేని అందాన్ని యితరుల కోసం వుండాలనుకుంటారు."

"వాళ్ళు నిర్భాగ్యులు కాదు. సృష్టి యిచ్చిన ప్రతిదానికి కొంత విలువ వుంటుంది. ఆ విలువలు యితరులకు వుపయోగించాలని అనుకొని, వుపయోగించనప్పుడు విషాదాన్ని కొనితెచ్చుకొనేది. విషాదం కంటె క్షణకాలం వెలిగిన చిరునవ్వు జీవితానికి ఎక్కువ వెలుగునిస్తుంది."

సురమ ఏమీ సమాధానం యివ్వలేదు. దీర్ఘంగా నిట్టూరుస్తూ కుర్చీలో వెనక్కి వాలింది.

"ఎందుకు ఏడుస్తున్నావు?" మరల అడిగాను.

నా కళ్ళలోకి క్షణకాలం చూసి అంది. "కారణం తెలుసుకొని మీరు కూడ బాధపడ్తారు."

"మగవాడు అంత తేలికగా బాధపడడు. అన్నాను నవ్వుతూ.

"అవి పైమాటలు. నన్ను గురించి మీరు కూడ బాధపడటం నాకు యిష్టం లేదు."

"నేనడిగిన ప్రశ్నకు జవాబు అదికాదు. నువ్వు ఎందుకు ఏడుస్తున్నావో చెప్పాలి."

"చెప్పకపోతే?"

"నేను కూడ ఏడుస్తాను."

ఆమె పెదవుల మీద చిన్న దరహాసరేఖ మెరిసి మాయమయింది. వెంటనే గంభీరత తెచ్చుకొని అంది "నేను అందంగా లేను కదూ!"

ఆమె కళ్లల్లోకి సూటిగా చూశాను వులిక్కిపడి. ఆమె నా కళ్లల్లోకి సూటిగా చూచి చెప్పసాగింది. "యివ్వాళ ఆఫీసరు ఫైల్ సరిగ్గా లేకపోతే అందంగా లేనని తిట్టాడు. నేను అందంగా లేనిమాట నిజమే. కాని యీ ప్రపంచానికి కావలసింది యీ అందం సంగతే. ఆఫీసులో ఎవ్వరూ సరిగా మాట్లాడరు. అంతా ముఖం చిట్లించు కుంటారు. నేను పాపపు రూపాన్నని నావంక అదోరకంగా చూస్తారు. నాకు యిన్ని బరువు గుండా వుంటే ఏడవకుండా ఎలా వుండను?"

ప్రపంచం ఆడదానిలో చూడాలనుకొనే సౌందర్యం మరిదేనిలోను చూడదు. చూడా లనుకోదు. అటువంటి మగవాడి పరిధులలో తన సౌందర్యాన్ని పరిమితం చేయటం యీ స్త్రీ నేర్చుకొని చాల సంవత్సరా లయింది. అయితే, అందమే లేని సురమ లాంటి స్త్రీ...?

సురమ వేసుకున్న ప్రశ్న నేను కూడ వేసుకొని వుండవచ్చు.

"సురమా! ఎవరో అన్నారని బాధపడటం మనల్ని మలుచుకోవటమే. మనం బతికేది వాళ్లకోసం కాదు. మన కోసం. అసలు మనిషి తోటిమనిషి కోసం బతకడు. ప్రాణాన్ని నిలబెట్టుకోడు, యివ్వడు. కేవ లం అవసరం తీర్చుకుంటాడు. అయితే సంఘం తోటిమనిషి కోసం బతకటమే అంటుంది. అలా బతకటం యిష్టంలేని చాలమంది తన్నులు తిట్లుతిన్నారు. నువ్వు బాధపడటం మానివేయి."

"నన్ను ఓదార్చటానికి ప్రయత్నించ కండి. నా మనస్సు బ్రతకమంటుందికాని, లేకపోతే యీపాటికి యీసంఘం కారణం గానే చచ్చిపోయేదాన్ని."

ఆ మాటలలో ఓదార్పు కన్న ఆ మనసుకు యింకా ఏదో కావాలి. అది లభించగలిగితే జీవితం మీద ఆశ పుట్టవచ్చు.

ఓ రోజు సాయంత్రం సురమ వెనుక దొడ్లో ఏదో పని చేసుకొంటోంది. నేను ఆగదిలోకి వచ్చిన తర్వాత సురమ పనిచేస్తూ వుండగా చూడటం యిదే మొదటిసారి. ఎప్పుడూ విచారంగా కూర్చొని ఆలోచిం

కాలం తప్ప ఏమీ చేయని సురమ యీరోజు పని చేస్తూ వుందంటే ఏదో కొంచెం విశేషముండి వుండాలి. మెట్లు దిగి బజారుకు వెళ్తూ వుండగా యింటిలోకి తొంగి చూశాను. తడిచేయి చెంగుకు వ్రాసుకొంటూ హాలులోకి వచ్చింది సురమ.

వెంటనే అడిగేశాను "ఏమిటి విశేషం. బిజీగా వున్నావనుకుంటూ"

"అమ్మ భద్రాచలం వెళ్ళింది. వండు కోటం తప్పదు కనక ప్రయత్నం చేస్తున్నాను." అంది.

"ఆడవాళ్ళా? వంట చేయటమా? హోప్స్ ఆఫ్ కల్చర్స్.. అటు ప్రపంచానికేసి చూడు.. పోయి ముందు కూర్చున్న మగవాడు మండించటం చేతగాక బిక్కముఖం వేసుక్కూర్చున్నాడు" అన్నాను హాస్యధోరణిలో.

నా హాస్యాన్ని ఆమె లెక్కించినట్లులేదు, అంది "అమ్మ వారంరోజుల వరకు రాదు. అంతవరకు వంటరిగా వుండాలంటే నాకు భయం."

తమ్ము చూసి తాము భయపడే వాళ్ళెప్పుడూ ఒంటరిగా వుండరు. నలుగురి మధ్య నిలబడి తనని కాసేపు మరచిపోవటానికి ప్రయత్నించుతారు. సురమ తన కురూపితనాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని భయపడుతూ వుంటుంది. ఆ విషయం దృష్టిలో వుంచుకొని అన్నాను. "సురమా! నీకభ్యంతరం లేకపోతే రాత్రుళ్ళు నా గదిలో పండుకో"

ఆమెకళ్ళల్లోకి సూటిగాచూశాను. ఆమె తల ఎత్తినా కళ్ళల్లోకి తడబడుతూ చూచి చూచి "వద్దు.. వద్దు.. యింక ఎప్పుడూ అలా అనకండి" అని తలదించుకొంది.

యిప్పుడు ఆమె యింకా దేనిని గురించి భయపడుతోందో కూడ తెలిసింది. అయినా దానిని యింకా పొడిగించి సురమను బాధ పెట్టటం యిష్టంలేక బజారుకు వెళ్ళిపోయి రాత్రి తొమ్మిదింటికి తిరిగివచ్చాను.

సన్న సన్నగా తుంపర పడ్తోంది. దాని కనుగుణంగానే గాలి కూడ వీస్తోంది. కొంచం చలిగా వుంది. గడియారం గంటకాలాన్ని పొడిగించి పదిసార్లు మ్రోగి మరల తన పని చూసుకొంటోంది. గది తలుపులు, కిటికి తలుపులు బిగించి ఏదో పుస్తకం తిరగ వేస్తున్నాను.

తలుపు మీద చప్పుడయింది.

పుస్తకంలో మునిగిపోయి మొదట అంతగా లక్ష్యపెట్టలేదు. కాని మరల చప్పుడు ఎక్కువయింది. లేచి వెళ్ళి తలుపుతీశాను.

సురమ—ఆశ్చర్యపోయాను.

# ● అశ్రుధార

చాప, దిండు, బెడ్‌షీట్‌తో సహా వచ్చింది. ఆమెను చూచి ఆశ్చర్యాన్నుంచి తేరుకొనే లోపల ఆమె నన్ను తోసుకొంటూ లోపలకు వెళ్ళి చాప పరుచుకొని, దుప్పటి పరుచుకొని నావంక తిరిగి అంది "ఏమిటి అలా చూస్తున్నారు! తలుపు వేయాలని లేదా? నాకు చలిగా వుంది, తలుపు వేయండి" అని చాప మీద వెల్లకిలా పండుకొంది. తలుపులకు గడియవేసి నేను నా మంచం మీద చేరుకొని అన్నాను. "ఆడదానికి భయాన్ని చూచి భయపడటం అలవాటు."

సురమ నా వంక చూచి ప్రక్కన కిటికీలో వున్న పత్రిక తీసి పేజీలు త్రిప్పుతోంది ఏమీ మాట్లాడలేదు. నేను పుస్తకం చదవటంలో మునిగిపోయి ఓ గంట గడిపేశాను. పుస్తకం చదవటం పూర్తయే సరికి సురమ నిద్రపోవటానికి వుపక్రమించింది. వెల్లకిలా పడుకొని వుంది. గుండెల మీద పేజీలు విడదీసిన పత్రిక పడివుంది. ఆమె ఉచ్ఛ్వాశ నిశ్వాశాలకు పత్రిక ఎగిరెగిరి పడ్తోంది. ఆమె కనుల వంక చూశాను. మూసుకుపోయిన కళ్ళల్లో ఎంతో తృప్తి అగుపడ్తోంది.

బయట వర్షం ఎక్కువయింది. అప్పుడప్పుడు పురిమిన శబ్దం వస్తోంది. లైటు ఆర్పివేసి బెడ్‌లైటు వేసి సురమ వంక చూస్తూ ఆలోచించసాగాను.

చిరు చీకటి వ్యాపించిన నా గదిని, అందులో వున్న సురమను, నన్ను బయటనుంచి చూచి యీసంఘం ఏమి చేయగలదో నాకు తెలుసు. నన్ను సురమనులు నేరస్తుగా నిలబెడ్తుంది. తన దగ్గర ఏదో శాసనం వుందని చూపించి నేరస్తులగా నిర్ణయించుతుంది యీసంఘం. అందుకు నేను భయపడను, బాధ పడను.

మేము నేరస్తులుగా మారిన తర్వాత నేను తనకోసం ఏమి చేస్తున్నానో సురమవూహించు కొంటే అంతేచాలు.. ఆమె నా గుండెల మీద వాలిపోగలదు. ఆనందంగా బ్రతకగలదు. యీ ఆశయం నెరవేరితే నేరస్తుడిగానే కాదు, మహాపాపిగా చిత్రించబడ్డా సహించగలను.

నేరం—పాపం—సంఘం—యీ మూడింటికి సంబంధం వుహాకేగాని వాస్తవానికి చాల దూరం. సంఘంలో చేయటానికి నేరమయితే ఆపని తన సుఖం కోసం చాటుగానైనా చేయగలదు. యిటువంటి ఎన్నోసి [illegible] దారి చూపేది సంఘమే అంటే ఘొల్లుమని ఏడుస్తుంది కూడాను. అయితే నేను యీ సంఘానికి చాటుగా వుండి సురమను బ్రతుకుమార్గంతో ముందుకు తీసుకువెళ్ళదలచుకోలేదు. సంఘం అక్షింతలు వేసినా, శాపం యిచ్చినా బాహ్యంగానే చేస్తాను.

వెక్కివెక్కి ఏడుపు వినబడటంతో నా ఆలోచనలు తెగిపోయాయి. సురమ వెక్కివెక్కి ఏడుస్తూ వుంది. ఎందుకో అర్థం కాలేదు. లేచి లైటువేసి చాప మీదే సురమ ప్రక్కన కూర్చుని ఆమె ముఖాన్ని నావైపుకు త్రిప్పుకొని అడిగాను.

"సురమా ఎందుకు ఏడుస్తున్నావు?"

చాలసేపటికి ఆమెనుంచి జవాబు రాలేదు. చాలసేపటికి ఏడుపు ఆపుకొని అంది "అమ్మకు నేనంటే పూర్తి నమ్మకముంది."

"దేనికి? ఏమిటది?" అర్థంకాక కొంచం ఆదుర్దాగానే అడిగాను. "తను భద్రాచలం వెళ్ళేటప్పుడు నా గదిలోనే పడుకోమని చెప్పివెళ్ళింది. పెళ్ళికాని ఆడపిల్లకు ఏతల్లీ అలా చెప్పదు. కాని, అమ్మ నమ్మకం—నా కురూపితనం ఎటువంటి ప్రమాదానికి దారి తీయదని."

సురమ మాటలకు వులిక్కిపడ్డాను. మాతృత్వం కూడా సౌందర్యాన్ని ఆరాధించుతుందా? చటుక్కున మొలకెత్తిన నాప్రశ్నకు జవాబు దొరకలేదు. యీలోపల సురమ అంటోంది "ప్రపంచంలో ప్రతి ఒక్కళ్ళు నాకు ఏదో విధంగా అన్యాయం చేస్తున్నారు. అమ్మనుంచి ఆఫీసరు వరకు నన్ను అంతర్గతంగా బాధించుతూనే వున్నారు. నేను చచ్చిపోవాలి.. చచ్చిపోవాలి."

కను కొలనులోనుంచి బిందువులు జలజల రాలి క్రిందపడ్డాయి. ఆమె కన్నులు తుడుస్తూ అన్నాను "సురమా! నిన్ను ఎవరూ బాధ పెట్టటంలేదు. నువ్వు ఆ కోణంలో ప్రతివాళ్ళను చూస్తున్నావు. నువ్వు చచ్చిపోనవసరంలేదు. నువ్వు పుట్టింది ఆత్మహత్య చేసుకోటానికి కాదు, ఆశలతో బ్రతకటానికి. ఆ ఆశ నేను కల్పించగలను. నాయీ గుండెలలో నీకు శాశ్వత శాంతి ప్రాసాదాన్ని నిర్మించుతాను సురమా?" అని ఆమెను గుండెలకు అదుముకున్నాను.

ఆమె వెచ్చని కన్నీటితో నా గుండెలు తడిసిపోయాయి. ఆమె గుండెలలోనుంచి పొంగిన ఆ కన్నీరు నన్ను నునువెచ్చని స్పర్శతో పులకింపజేసింది. ఆ పులకింతలో ఆమె నన్ను మరింత గట్టిగా హత్తుకుంది. ●


NEW KING-SIZE
No.1
BEAUTY SOAP
by
Godrej

# రాజధానిలో పతిత స్త్రీ జనోద్ధరణ కృషి

ఆధునిక కాలాలలో వేశ్యావృత్తి నిర్మూలనకోసం కృషిచేసిన వారిలో కేశవ చంద్రసేన్ ఒకరు. ఈ దేశంలో 'ఎసోసియేషన్ ఫర్ మోరల్ ఎండ్ సోషల్ హైజీన్' 1928 లో నెలకొల్పబడింది. 1956 లో వేశ్యావృత్తిని నిషేధించే చట్టం ఒకటి వచ్చి, 1958 కి అన్నిరాష్ట్రాలలో అమలు జరిగింది. ఈ విషయమయి కృషిచేసే సంస్థలలో హైదరాబాదులోని 'నారీ సుధార్ సొసయిటీ' ఒకటి.

“జీవితపు మొదటి పాదంలో కాలు జారిన యువతులు ఉత్తమ జీవితాన్ని కొనసాగించేందుకు కృషిచేస్తున్నాము. మా సేవాసదనంలో ఆశ్రయమిస్తున్నాము. సంస్కరిస్తున్నాం. వివిధ వృత్తుల్లో ఉచితంగా శిక్షణ ఇస్తున్నాము. వారి మానసిక వికాసానికి, అనువైన పద్ధతులను అవలంబిస్తున్నాం. తగిన భర్తలనుకూడా అన్వేషించి పెద్దల సమక్షంలో పెళ్ళిచేసి, తిరిగి సమాజంలోనికి పంపిస్తున్నాము. కానీ...” అంటూ ఆగిపోయారు శ్రీమతి ప్రేమలతాగుప్తా. గత 15 సంవత్సరాలుగా పతితల ఉద్ధరణకు అవిరళ కృషి చేస్తున్న కొద్దిమందిలో ఆమె ఒకరు.



నారీ సదన్ (సంస్కారగృహం) వారు గత వార్షికోత్సవంపం దర్భంలో జానపద నృత్యం ఏర్పాటు చేసినప్పుడు తీసిన చిత్రం.

సంసారంతో సమాజంలో ప్రవేశించిన స్త్రీలు అనైతిక శక్తుల వాతావరణం వల్లనేమీ, మరో కారణంవల్లనైతేనేమి మళ్ళీ పతితలుగా మారుతున్న సందర్భాలున్నాయని శ్రీమతి ప్రేమలత తెలిపారు.

ఆర్థిక ఇబ్బందుల వల్లనేమి, సరాతన దాంపత్యంలో అసంతృప్తి వల్లనేమి, సవతితల్లి, అత్తగారి పోరువల్లనేమి వయస్సులో వ్యామోహాల హెచ్చువల్లనేమి, పలువురు స్త్రీలు పథవిహీనలవుతున్నారు. అనైతిక వర్గాములవుతున్నారు. చివరికి పతితలై కోర్టులకెక్కుతున్నారు. శాసనం ద్వారా మనిషి పరివర్తన, దృక్పథాన్ని అమాంతంగా మార్చడం సాధ్యం కాదన్నది పలురంగాలల్లో నిరూపితమయింది. అందుకే సమాజ సేవా తత్పరత గలవ్యక్తులు సంస్కరణలకు అంకితమవుతున్నారు. ప్రభుత్వం చట్టాలద్వారా అనైతిక వ్యాపారాలను మార్చలేని స్థితిలో వారు సంస్థలద్వారా సమాజాన్ని సన్మార్గాన నడిపించజేస్తున్నారు. శ్రీమతి వెల్లోడి వంటి మహిళలు, హైదరాబాదులోని నారీ సుధార్ సొసైటీ లాంటి సంస్థలు పెరిగితే, నైతిక విలువలు పునరుద్ధరింప బడుతాయి.

ఒకసారి మద్రాసులో జరిగిన మహిళల సమావేశానికి హైదరాబాదు నుంచి శ్రీమతి వెల్లోడి వెళ్ళారు. అక్కడ శ్రీమతి పి. టి. లక్ష్మి స్త్రీలకోసం కావిస్తున్న కృషిని గమనించారు. స్ఫూర్తిని పొందారు. తిరిగి హైదరాబాదుకు రావడంతోనే నగరంలోని ప్రముఖ మహిళలను, వ్యక్తులను ఆహ్వానించి నారీ సుధార్ సొసైటీని నెలకొల్పవలసిన ఆవశ్యకతను తెలియజేశారు. 1951 లో ఆసొసైటీని స్థాపించారు. అప్పటికింకా హైదరాబాదు ప్రభుత్వం వ్యభిచార నిరోధక చట్టాన్ని ఆమోదించలేదు. ప్రభుత్వం వెంటనే దాన్ని అమలు పర్చ

వారు కలిసిపోతారు. గత ఆరేళ్లలో మొత్తం 800 దరఖాస్తులు వచ్చాయి. ఆయా అధికారులతో స్థానికుల, వ్యక్తుల నైతిక వర్తనను, గుణ్యావగుణాలను తెలుసుకొంటారు. సొసైటీవారు వారిని పిలిపించి పరిస్థితులను వివరించి స్త్రీలను చూపిస్తారు. స్త్రీల అభిప్రాయాలను కూడా తెల్సుకుంటారు. ఇద్దరూ ఇష్టపడితే, వివాహం చేస్తారు. పెళ్లిచేసుకునే వారికి ఒకే కులం వారినే నిశ్చయం చేస్తారు. ఇటీవల 5 గురి వివాహాన్ని ఒకేసారి జరిపారు. ఈ సొసైటీ అధ్యక్షురాలు శ్రీమతి కాసు రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి విచ్చేసి వధూవరులకు కానుకలిచ్చి ఆశీర్వదించారు. సొసైటీ తరఫున వధువుకు ఒక పెట్టె, రెండు చీరెలు ఇస్తారు. వివాహం అయిన తర్వాత కూడా సొసైటీవారు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతుంటారు. మింటలేని వరుడకానీ, ఇతర కులంకానీ తమ కొక అర్ధాంగి కావాలన్న ధ్యేయంతోనే ఈ వివాహాలకు అంగీకరిస్తున్నారు. కానీ, సంస్కరణ, ఉన్నతాదర్శంతో, సంస్కారంతో ఈ వివాహాలకు సిద్ధపడుతున్నవారు తక్కువే. ఇంతవరకు మొత్తం 80 వివాహాలు జరిగాయి.

కానీ, ఆ వివాహాలు కూడా విచ్ఛిత్తి జరిగిన సందర్భాలున్నాయి. కారణాలు చాలా ఉంటాయి. మళ్లీ ఆ స్త్రీలు పతిహీనలు కావడానికి ప్రోద్బలాలు వుంటాయి. అలా కోర్టుద్వారా తిరిగి సంస్కారసదన్ కు కొందరు వచ్చారు. అందుకే శ్రీమతి ప్రేమలత ప్రజా సహకారం, అత్యవసరమన్నారు. పునరావాసకల్పన అన్నింటిలోనికి వివాహబంధమే అతీయమైనదని ఆమె దృఢ విశ్వాసం.

### కుటుంబ జీవితసంస్థ

నారీసుధార్ సొసైటీ నేరస్థులను సంస్కరించడమేకాకుండా, నైతిక నేరాలను నివారించడానికి కూడా కృషి చేస్తున్నది. కుటుంబ జీవిత సంస్థను నేరాన్ని నివారించేందుకుగాను 1965లో నెలకొల్పినది. కుటుంబ జీవిత పాఠ్యాన్ని తెలియజేస్తుంది. [illegible] ఉపాధ్యాయ కోర్సును ప్రారంభించింది. ఇంతవరకు 160మందికి 33 [illegible] శిక్షణ గరిపినది. ప్రస్తుతం నాలగవ కోర్సు జరుగుతున్నది. ఇందులో 4 గురు స్త్రీలు, 20 మంది పురుషులు కుటుంబ జీవిత విశేషాలను తెల్సు[illegible]. సాంఘిక సంక్షేమశాఖ, స్త్రీల [illegible] ఉద్యోగులను కూడా

# రాజధానిలో...

ఈ కోర్సుకు పంపిస్తున్నది. కుటుంబ నియంత్రణ ఉద్యోగాలకు ఈ శిక్షణ యోగ్యతగా గుర్తిస్తే దీనికి ప్రాముఖ్యం పెరుగుతుందని డైరెక్టర్ ఆర్చార్డ్ బాకస్ ఆప్కారీ నాతో చెప్పారు. ఆయన ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సోషియాలజీ లెక్చరరు కూడా.

### సలహా కేంద్రం

అంతేకాదు, సలహా సంప్రదింపుల కేంద్రాన్ని కూడా ఈ సొసైటీ నెలకొల్పినది. భారత ప్రభుత్వం ఫూల్ అధికారి డాక్టర్ ఉషా ఆనంద్ దీనికి సలహాదారు. దక్షిణాదిలోనే ఇలాంటి కేంద్రం మరొకటి లేదు. విద్యార్థి జీవితంలో సర్దుబాట్లు, వ్యక్తిగతమైన సంబంధాలు, కుటుంబం, పెళ్ళి, సెక్సుకు సంబంధించిన పలు సమస్యలపై ఆమె సహాయం చేస్తుంది.

1965—66లో మొత్తం 14మందికి ఆమె మనస్తత్వశాస్త్ర పద్ధతులద్వారా సమస్యలను పరిష్కరించినది. ఇంతవరకు ఎక్కువ మంది పురుషులే ఆమె సలహాలను తీసుకున్నారు. ఈ కౌన్సిలింగ్ కేంద్రానికి ఇంకా ప్రాచుర్యం లభించలేదు.

### గుంటూరులో నారీసదన్

ఈ నారీసుధార్ సొసైటీ స్త్రీలఉద్ధరణకై జిల్లాల్లో కూడా కేంద్రాలను నెలకొల్పినది. గుంటూరు, నెల్లూరు, నిజామాబాద్, నల్గొండ, మహబూబ్ నగర్, ఖమ్మం, మెదక్, పశ్చిమ గోదావరిలో ఈ సొసైటీ శాఖలు స్థానిక ప్రముఖుల సహాయంతో పని చేస్తున్నాయి. గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాల్లో సాంఘిక జాడ్యాలు అధికంగాఉన్నాయట. అక్కడ నారీ సదన్ లాంటి సంస్కార గృహాలను కూడా నెలకొల్పవలసిన అవసరం ఉంది. ముఖ్యంగా గుంటూరులో త్వరలో ఇలాంటి సంస్కారసదన్ ఏర్పాటుకానున్నది.

నారీసుధార్ సొసైటీ నిర్వహిస్తున్న ఈ నారీ సదన్ కు ఏటా 18 వేల రూపాయలు ప్రభుత్వం గ్రాంటు ఇస్తున్నది. కానీ నిధులు సరిపోవడంలేదు. నారీసదన్ కు భవనంలేదు. వృత్తి విద్యలు అధికంగా నేర్పడానికి వసతులులేవు. నారీ సదన్ లో కోళ్ల పెంపకాన్ని ఏర్పాటుచేసే పథకాన్ని మంజూరు చేయవలసినదిగా ప్రభుత్వాన్ని సొసైటీ కోరినది. విడుదలైన స్త్రీలకు [illegible] సొసైటీ ప్రభుత్వాన్ని కోరి చాలా కాలమైనది. కానీ ఫలితంలేదు.

### సుఖరోగాల క్లినిక్కులు

హైదరాబాదులో సుఖ రోగాల క్లినిక్కులను నెలకొల్పడానికి ఈ నారీసుధార్ సొసైటీ కృషి చేస్తున్నది. వ్యభిచారిణుల పిల్లలకు బాలవాడలు, 'కాంటాక్ట్' క్లబ్ లు ఏర్పాటు చేయడానికి ఉద్దేశిస్తున్నది. సెక్సు విద్యతో సహా ఆరోగ్య విద్యాకార్యక్రమాన్ని చేపట్టనున్నది.

### విజిలెన్సు కమిటీలు

గ్రామాల్లో సమితిస్థాయిలో అధికారులతో విజిలెన్సు కమిటీలు ఏర్పాటుచేయాలని భావిస్తున్నది. నగరంలోకూడా విజిలెన్సు కమిటీల ఏర్పాటుకై ప్రభుత్వంతో సంప్రదిస్తున్నది. ప్రస్తుతం జిల్లాలోని శాఖలను సమర్థవంతంగా పని చేయడానికి కృషిచేస్తున్నది.

లోగడ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీమతి లలితానచార్, శ్రీమతి నాగరత్నమ్మ సంజీవరెడ్డి, ఇప్పుడు శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి సహాయ సహకారాలతో ఈ నారీసుధార్ సొసైటీ నారీలోకానికి చేస్తున్న కృషి ప్రశంసనీయం.

'కార్యేషు దాసీ కరణేషు మంత్రీ;
రూపేచలక్ష్మీ క్షమయాధరిత్రీ;
స్నేహేచమాత'గా స్త్రీలు రూపొందడానికి కృషి జరుగుతున్నది.

వ్యభిచార నిరోధక చట్టం అమలు తర్వాత రాజధానిలో అనైతిక కార్యాలు గుంభనంగా జరగడం శోచనీయం. లోగడ పరిమితమైన ప్రాంతాల్లోనే వ్యభిచారం స్వేచ్ఛగా జరిగేది. అది ఈనాడు నిషేధింపబడింది. కానీ చట్టాలకు సైతం లొంగని విధంగా, అభ్యుదయం పేరుతో, సంస్కారం, సంస్కృతి, ప్రగతి అనే ముసుగులో అనైతికమైన పనులు గుంభనంగా జరిగి పోతున్నవని శ్రీమతి ప్రేమలత ఈ రచయితతో చెప్పారు. సమాజంలోని ఈ క్షాళనాన్ని ప్రక్షాళనం చేయడం దుస్తరమే. ప్రతి ఒక్కరిలోనూ ఆత్మసంశోధన జరిగితేనే అనైతిక అరాచకాలు పరిసమాప్త మవుతాయి.

—కాసాని సుదర్శన్ రెడ్డి

## ఆ అధిక శక్తికోసం
## మైకో
## స్పార్క్ ప్లగులు

ఆ అధిక శక్తిని మైకో స్పార్క్ ప్లగులతో మీ ఇంజనులలో ఉంచండి. శక్తివంతమైన మైకో స్పార్క్ ప్లగ్గులు భారతదేశమున తయారగు కార్లు, మూడు చక్రముల బండ్లు, స్కూటర్లు మరియు మోటారు సైకిళ్ళకు సమర్ధ్యబడు మూలోపకరణములకుగాను ప్రత్యేకముగా తయారు చేయబడినవి.

**మైకో కృషి ఉత్తమ రహదారి ప్రయాణ సౌకర్యములకు**







**మోటారు ఇండస్ట్రీస్ కంపెనీ లిమిటెడ్, బెంగళూరు**

దక్షిణ భారతీయ వ్యాపార వివరాలకై సంప్రదించండి: మోటార్ ఇండస్ట్రీస్ కం. లిడ్., 1/155 మౌంట్ రోడ్, మద్రాసు-2

మరియు హైదరాబాద్ ఆటో సర్వీస్, 40, మహాత్మగాంధి రోడ్, సికింద్రాబాద్ (ఆం. ప్ర.)

ASP/MICO/2

'మనసే మందిరం' లో నాగేశ్వరరావు, జగ్గయ్య, సావిత్రి

చిత్రసమీక్ష:

# మనసే మందిరం

స్త్రీని పవిత్రమైనది. దాని ఉన్నతితో ప్రేమించిన వదిమందికోసం తనది ప్రేమను త్యాగంచేసి ప్రాణానికి ప్రాణం ఇచ్చిన వ్యక్తి ధన్యమైనవాడు. అటువంటి వ్యక్తి హృదయమే ఒక పవిత్ర దేవాలయం. అలాంటి మానవుడు పొరబడినా అమరుడే అవుతాడు అన్న ఉత్కృష్టమైన కథా ఇతివృత్తంతో ఒకే ఒక సెట్‌లో 25 రోజుల్లో చిత్రీకరించిన చక్కని సాంఘిక చిత్రం శ్రీ కృష్ణా ఫిలింస్ వారి 'మనసే మందిరం.'

డాక్టర్ రఘు, సీత పరస్పరం ప్రేమించుకున్నారు. వివాహం చేసుకుందామనుకున్నారు కాని కథ అడ్డం తిరిగి పరిస్థితుల ప్రభావం వల్ల సీత మరొకరికి ఇల్లాలవుతుంది. ప్రేమ విఫలమైన డాక్టర్ రఘు ఒక నర్సింగ్ హోం స్థాపించి కేన్సర్ రోగుల పాలిటి కల్పవృక్షంగా పేరు తెచ్చుకుంటాడు. సీతను ప్రతిష్ఠించుకున్న హృదయంలో మరొకరికి స్థానం ఇవ్వటానికి ఇష్టపడని రఘు మానవ సేవలోనే తన జీవితాన్ని గడపటానికి నిశ్చయించుకుంటాడు. ఒక నాడు సీత తన భర్త రాముతో డాక్టర్ రఘు నర్సింగ్ హోంకి వస్తుంది. రఘు సీతలు ఒకరొకరు చూసుకుని ఆశ్చర్యపోతారు. రాము కేన్సర్ వ్యాధి తోటి బాధపడుతుంటాడు. పెద్ద పెద్ద డాక్టర్లు సైతం దాన్ని బాగు చేయలేక వదిలి పెట్టారని తెలిసిన డాక్టర్ రఘు సీతకు పరిస్థితిని వివరించి తన శక్తినంతా ధారపోసి రామునికి మామూలు మనిషిని చేస్తానని మాట ఇస్తాడు. సహృదయుడైన డాక్టర్ రఘు స్నేహం వాంఛిస్తాడు రాము. ఒకనాడు తన భర్త ఆరోగ్యాన్ని గురించి ఆలోచిస్తున్న సీత దగ్గరికి రఘు వచ్చి తనను వివాహం చేసుకోకుండా వేరొకరికి ఇల్లాలయిన కారణం చెప్పమని అడుగుతాడు. సీత చెప్తుంది.

మనోవ్యథతో ఉన్న హృదయం గల డాక్టర్ రఘు ప్రేమించింది సీతనేనని రాము తెలుసుకుంటాడు. తాను మరణిస్తే డాక్టర్ రఘుని సీత వివాహం చేసుకోవాలని చెప్తాడు. భర్త మరణించిన తర్వాత తాను ప్రాణంతో ఉండటం కల్ల అంటుంది సీత. రాముకి తప్పకుండా నయం అవుతుందంటాడు డాక్టర్ రఘు. రామూ కంటే ముందు అదే నర్సింగ్ హోంలో ఉన్న ఉమ అనే బాలికకు ఆపరేషన్ చేయటానికి సంకల్పించుకుంటాడు రఘు. ఉమకు చేసిన ఆపరేషన్ విజయవంతమైతే తన భర్తకు కూడా నయమవుతుందన్న 'గుడ్డి నమ్మకాన్ని' కలిగి ఉన్న సీత నమ్మకాన్ని వమ్ము చేస్తుంది కల్యాయుమురాలైన ఉమ. వేరే నర్సింగ్ హోంకి వెళ్దామన్న సీతతో తాను మరణిస్తే సహృదయుడూ మిత్రుడూ అయిన డాక్టర్ రఘు చేతిలోనే మరణిస్తాను కానీ వేరే నర్సింగ్ హోంకి వెళ్లనంటాడు రాము. డాక్టర్ రఘు నిద్రాహారాలు మాని అకుంఠితమైన కృషి చేస్తాడు.

రాముకి ఆపరేషన్ చేస్తాడు డాక్టర్ రఘు. ఆపరేషన్ విజయవంతమవుతుంది. రాము మృత్యు ముఖం నుండి బయట పడ్డాడు. డాక్టర్ రఘు వెళ్లి—తన భర్త ప్రాణాన్ని కాపాడమని దైవాన్ని వేడుకుంటున్న—సీతతో ఆ సంగతి చెప్తాడు. కానీ ఆ తర్వాత అనుకోని విధంగా ఎవ్వరూ ఊహించని ఘోరం జరిగిపోతుంది...

ఈ చిత్రంలో నాగేశ్వరరావు, జగ్గయ్య, గుమ్మడి, రేలంగి, చలం, సావిత్రి, గిరిజ, బేబి శాంతికళ, నిర్మల, నాగభూషణం, శాంత కుమారి, శారద మొదలగువారు నటించారు.

పవిత్రమైన హృదయం, మహోన్నతమైన త్యాగశీలం కలిగిన డాక్టర్ రఘుగా అక్కినేని నాగేశ్వరరావు ఆ పాత్రకు జీవం పోశారు. సీతగా సావిత్రి నటన ఉన్నతమైన స్థాయిలో ఉన్నది. కేన్సర్ రోగిగా, మహోన్నతమైన హృదయంగల మనిషి రాముగా జగ్గయ్య నటన అపూర్వంగా, మరుపురానిదిగా ఉంది. గుమ్మడి చక్కని భావప్రకటనను తన నటనలో కనిపింపజేశారు. ఉమగా బేబి శాంతికళ ముచ్చటగా ఉంది. రేలంగి, చలం, నాగభూషణం, గిరిజ, ముచ్చటైన చక్కని హాస్యాన్ని పండించారు. తన పాత్ర చిన్నదైనా సమర్థవంతంగా పోషించింది శారద.

చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం శ్రీధర్ నిర్వహించారు. పాటలు ఆచార్య ఆత్రేయ సమకూర్చారు. ఎం. ఎస్. విశ్వనాథం వినసొంపైన సంగీతాన్ని అందించారు. పాటలన్నీ వినసొంపుగా ఉన్నాయి. ఛాయాగ్రాహకుడు బాలు చక్కని నేర్పును కనబరిచారు చిత్రీకరణలో. దర్శకత్వం అత్యంత ప్రతిభావంతంగా ఉన్నది. ఈ చిత్రానికి నిర్మాత యర్రా అప్పారావు.

—మాధవ్

# చిత్రలహరి

## దర్శకుడుగా శ్రీ యస్. వి. రంగారావు

రెండు దశాబ్దాలుగా చిత్ర పరిశ్రమలో ఉంటూ, తెలుగు తమిళ ప్రేక్షకుల చేత ఉత్తమ నటుడుగా వాడూ, నేడూ కూడ గణించబడుతూన్న శ్రీ యస్.వి.రంగారావు— యిపుడు ఒక తెలుగు చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. యస్. వి. ఆర్. ఫిలిమ్స్ అనే కొత్త సంస్థ యీ చిత్రాన్ని నిర్మిస్తున్నది.

పలువురినీ ఆకర్షించే విశిష్టమయిన అంశాలుగల యీ కుటుంబ చిత్రానికి శ్రీ డి.వి.నరసరాజు కథ, సంభాషణలు సమకూర్చారు. వి.కె. శేఖర్ కళాదర్శకత్వమూ, కమల్‌ఘోష్ ఛాయాగ్రహణమూ సంగీత దర్శకత్వపు బాధ్యతను టి. వి. రాజు నిర్వహిస్తారు. అక్టోబరు 15 నుంచి విజయ స్టూడియోలో ప్రారంభమయే యీ చిత్రం — మొదటి షూటింగు షెడ్యూలులో జమున, రమణారెడ్డి, సూర్యకాంతం, రాజ్‌బాబు, రమాప్రభ పాల్గొంటారు. కథానాయకుని ఎన్నిక యింకా కాలేదు. శ్రీ రంగారావు దర్శకత్వం బాధ్యత చేపట్టడమేకాక యిందులో ఒక ముఖ్య భూమికను పోషిస్తున్నారు. గుమ్మడి, అంజలీదేవి కూడ తారాగణంలో ఉన్నారు. దాశరథి గీతాలు రాస్తున్నారు! నిర్మాత: బడేటి సత్యనారాయణ.

## రక్తసిందూరం

రిపబ్లిక్ ప్రొడక్షన్స్ వారి సాహసోపేత జానపదచిత్రం "రక్తసిందూరం" నిర్మాణం పూర్తికావస్తున్నది._ రాజశ్రీ, శోభన్‌బాబు, బాలయ్య, రామకృష్ణ, ప్రభాకరరెడ్డి, రామశర్మ, ప్రసాద్, త్యాగరాజు, అశోక్‌కుమార్, పద్మశ్రీ నాగయ్య, గీతాంజలి, విజయలలిత, సూర్యకళ, పండరీబాయి నటిస్తున్నారు. ఈ చిత్రంలోని అవుట్‌డోరు దృశ్యాల చిత్రీకరణ ఒక విశేషమని తెలుస్తున్నది. రచన, నిర్మాణం, దర్శకత్వం: పి. సీతారాం.



'ఆమె ఎవరు?' లో జగ్గయ్య, వాణిశ్రీ

## గొల్లభామ

వసంత మందిరంలోనికి గొల్లభామను తీసుకువచ్చి జయచంద్రుడు సంస్కరిస్తున్నాడు. అన్ని విద్యలూ తర్ఫీదు యిస్తున్నాడు. చదువు, వీణ, చిత్రలేఖనం



'సత్యమే జయం' లో రాజశ్రీ

నృత్యం, కత్తియుద్ధం— ఇలా అన్నీ నేర్పాడు. ఆమె యెంతో ఆసక్తితో నేర్చుకుంటున్నది. జయచంద్రుడు వచ్చేసరికి ఆమె గార్దభాన్ని చిత్రిస్తున్నది. ఆ చిత్రాన్ని చూసి అతడు ఆశ్చర్య చకితుడయి "ఏమిటిది?" అని అడిగాడు. "గణపతి చిత్రాన్ని వేస్తున్నాను" అన్నది గొల్లభామ. అక్కడేవున్న గణపతి యీ మాట విని గతుక్కుమన్నాడు. జయచంద్రుడు విరగబడినవ్వాడు. శేఖర్ ఫిలిమ్స్ వారు నిర్మిస్తున్న "గొల్లభామ" చిత్రానికి సంబంధించిన యీ దృశ్యంలో గొల్లభామగా దేవిక, జయచంద్రుడుగా యస్. టి. రామారావు, గణపతిగా రేలంగి పాల్గొన్నారు. సిద్ధహస్తుడయిన శ్రీ సి.పుల్లయ్య దర్శకత్వంలో యీ చిత్రం రమణీయంగా రూపొందుతున్నది. యస్. వరలక్ష్మి, ఎల్. విజయలక్ష్మి, విజయనిర్మల, గిరిజ, పుష్పవల్లి, రుష్యేంద్రమణి, రేలంగి, రాజ్‌బాబు, ముక్కామల, ధూళిపాళ, నాగరాజారావు మిగిలిన ముఖ్య తారాగణం. నిర్మాతలు: కె. సోమశేఖర్, డి. రాధాకృష్ణ. ఇంతవరకు ఎనిమిది రీళ్ళ చిత్రం తయారయింది.

## శ్రీమతి

బస్‌స్టాప్ దగ్గర ఒక అమ్మాయి నిలబడి ఉన్నది. చాలా నవనాగరికంగా అలంకరించుకొని ఉంది. చేతిలో పుస్తకాలు ఉన్నవి. అరవైయేళ్ళ ఏకాంబరానికి ఆ అమ్మాయిని పలుకరించ బుద్ధి అయింది.

## చిత్రలహరి

"పొవరాకడ, ప్రాణం పోకడ తెలుసుకోవడం కష్టం అంటారు కాని, ఈ హైదరాబాద్ లో బస్ ల రాకడ— పోకడ తెలుసుకోవడం బ్రహ్మకు కూడా తరం కాదు... ఇదుగో అమ్మాయ్! నువ్వు కూడా బస్ కోసమే నిలబడ్డావా?" అడిగాడు ఆమెకు కొంచెం దగ్గరగా వచ్చి. "ఏమిటా ఈ ప్రశ్న. కనబడడం లేదూ?" అన్నది విసురుగా. ఏకాంబరం ఇంగుతిని "కనిపిస్తూనే ఉంది చిరాకు... నాకు తెలీదూ. పెళ్ళికాకముందు ఆడపిల్లలంతా యింతే! ఆ మూడు ముళ్ళు పడ్డ తర్వాత గాలి తీసిన బెలూనులాగ అణిగి మణిగి ఉంటారు. అది సరేగాని వివరాలెక్కడుంటున్నారు ఏమిటీ?" అడిగాడు. ఆ అమ్మాయికి యీ వృద్ధజంబుకం నాటకం చూసి కోపం ముంచెత్తుకొచ్చి "ఇంట్లో" అన్నది పెడసరంగా. "అలాగా! పోనీ మీ నాన్న గారు ఎక్కడ పనిచేస్తున్నారో అదయినా చెప్పు!" "ఆఫీసులో!" "నా తల్లే... ముక్తసరిగా మాట్లాడుతున్నావ్, రామ చిలకలాగ!" అన్నాడు ఏకాంబరం మెల్లగా. "ఈ వివరాలన్నీ మీకు దేనికి?" "ఏముందీ— నీలాంటి అందమయిన అమ్మాయిలు కనిపిస్తే అడగడం నా ధర్మం. అవునో కాదో చెప్పడం నీ ధర్మం. ఆ తర్వాత మంచీ చెడూ మాట్లాడుకోవడం— వెంటనే జరుగవలసిన కార్యక్రమం జరిపించేయడం.." అని ఏకాంబరం ఇంకా ఏదో అనబోతుండగా, అసలే మండిపడుతున్న ఆ అమ్మాయి మధ్యలోనే అందుకుని "ఏం కవాశావ్, మళ్ళా కూయ్!" అన్నది. రమణీయ మయిన యీ సన్నివేశం శ్రీ విజయం పిక్చర్స్ వారి "శ్రీమతి" చిత్రం లోనిది. కాంతారావు, శారద, వాసంతి, సత్యన్నారాయణ, చలం, అల్లురామలింగయ్య, రామన్న పంతులు, మీనా కుమారి, సూర్యకళ, గీతాంజలి మున్నగు వారు నటిస్తున్న ఈ చిత్రానికి దర్శకుడు: విజయారెడ్డి.

—మోహన్ కుమార్ ●

## బాల సాహితి

(6-వ పేజీ తరువాయి)

చూడవచ్చు. ఆ ఒక్క నాణెమును మాత్రమే చూచి ఆ మూడు డబ్బాలలోనూ ఏందులో ఏయే నాణెములున్నాయో చెప్పగలగాలి.

వెంకప్ప ఆ మూడు డబ్బాలనూ పరకాయించి చూచాడు. వాటిలో ఏ డబ్బాలో చెయ్యి పెడితే ఏలో ఆలోచించాడు. ఆఖరికి "బంగారు— వెండి" అని వ్రాసి ఉన్న డబ్బా మూత తెరిచి ఒక్క నాణెమును బయటికి తీశాడు, చూడగా అది బంగారు నాణెం. ఆ డబ్బాలో ఉండి పోయిన రెండవ నాణెం వెండిది అయి ఉండకూడదు. ఏమంటే అప్పుడు ఆ మూత మీద వ్రాసిన "బంగారు— వెండి" అన్న వ్రాత నిజం అయి పూరుకుంటుంది. మూతలు అన్నీ తారుమారు అయాయి అనీ, మూతల మీది వ్రాతలలో ఏ ఒక్కటీ సరిగ్గా లేదని కదా చెప్పేరు? కనుక ఆ డబ్బాలో ఉండిపోయిన రెండవ నాణెం కూడా బంగారపుదే అయిఉండాలి. ఈ డబ్బాలోని నాణెముల భోగట్టా తెలుసుకున్నాక "వెండి—వెండి" అని వ్రాసి ఉన్న డబ్బాలో ఏముంటాయో సులభంగా చెప్పవచ్చు. అందులో ఉన్నవి రెండూ వెండి నాణెములు అయి ఉండకూడదు. ఏమంటే, అప్పుడు మూత మీది వ్రాత నిజం అవుతుంది. అందులోవి రెండూ బంగారు నాణెములు అవడానికి కూడా వీలులేదు. ఏమంటే, ఇంతకు ముందే రెండూ బంగారు నాణెములే ఉన్న డబ్బాను వెతికి పట్టుకున్నాం కదా? కనుక ఈ డబ్బాలో ఒకటి బంగారు నాణెమూ, రెండవది వెండి నాణెమూ అయి ఉండాలి. ఇంక మూడవ డబ్బాలోవి రెండూ వెండి నాణెములే అని వేరే చెప్పాలా? ఈ విధంగా ఏయే డబ్బాలలో ఏయే నాణెములున్నాయో చెప్పవచ్చు — ఒకవేళ మొదటిసారి "బంగారు— వెండి" అని వ్రాసి ఉన్న డబ్బాలో చెయ్యిపెట్టి బయటికి తీసిన నాణెము వెండిది అయినా సరిగ్గా ఇదే విధమైన తర్కంతో ఏ డబ్బాలో ఏ మున్నదో తెలుసుకోవచ్చు.

వెంకప్ప తర్కం విని రాజు శిరఃకంపం చేశాడు. ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA




విజయరాణి